# ఎల్ల వేళలలోను

# షార్ప్ ఝంకార్ మీ జీవితానికి ఆనందాన్ని యిస్తుంది

ajanta JR/265



మోడల్ UL-164 (టేబుల్ మోడల్)
**6-ట్యూబ్ 4-బ్యాండ్ AC సెట్**
బాస్ & ట్రెబిల్ టోన్ కంట్రోల్స్ రు.**375**
ఎక్సైజ్ డ్యూటీ రు.40. పన్నులు అదనం.



మోడల్ **5 A-46**
**6-ట్యూబ్ 4-బ్యాండ్ AC సెట్**
వేరియబుల్ టోన్ కంట్రోల్ రు.**350**
ఎక్సైజ్ డ్యూటీ రు.40. పన్నులు అదనం.



మోడల్ BZ-490 (పోర్టబుల్ సెట్)
**9-ట్రాన్సిస్టర్ 4-బ్యాండ్**
**ఫైన్ ట్యూనింగ్ రు. 375**
ఎక్సైజ్ డ్యూటీ రు.40. పన్నులు అదనం

విభ్రాంతి గలిగించు క్రికెట్ వ్యాఖ్యానము శ్రావ్యమైన సంగీతం. లేక ఉత్సాహవంతమైన వార్తలు ఏవైనాకాని-అన్నీ మీ ఆధిక్యములో ఉంటవి!—ఒక షార్ప్ ఝంకార్‌ను గలిగియుండండి. సరసమైన ధరలలో, సొగసైన ఆకారములలో షార్ప్ ఝంకార్ అందరికీ అందుబాటులో ఉన్నది.

నాణ్యమైన వస్తువుల తయారుచేయుటలో ప్రపంచ ఖ్యాతిపొందిన హాయకావా ఎలెక్ట్రికల్ కం. లి. జపాన్‌వారి సాంకేతిక సహాయంతో తయారుచేయబడుచున్న **Sharp JHANKAR** అని జ్ఞాపకముంచుకోండి.




RTM No. 197008

ఇండియన్ ప్లాస్టిక్స్ లి., లోటస్ హౌస్, బొంబాయి-1

# ఉత్తరాలు

### ముఖచిత్రం

24—12—65 ఆంధ్ర సచిత్ర వారపత్రిక ముఖచిత్రము నటుడు శ్రీ రమణమూర్తి నన్నెంతో ఆకర్షించారు. చాలరోజులుగా యిటువంటి అందమైన పోజులో తన చిత్రాన్ని చూడాలని నాలో వున్న కోర్కె నేటికి తీర్చ గలిగినందుకు నా అభివందనములు.

డి. కృష్ణమూర్తి (నైవేలి)

### ఊమెన్ కార్టూన్

"ఊమెన్ కార్టూన్"లో అమెరికానుంచి అత్యవసరంగా అందిన $1\frac{1}{2}$ మిలియన్ టన్నుల ఆహారం తగులబడి పోతూండగా అమెరికా అగ్ని మాపకదళన వచ్చి మంటలను ఆర్పినట్లుగా వున్నది. అది మన దేశాన్ని న్యూనతగా చిత్రించినట్లున్నది. మన దేశముయొక్క ఆహార పరిస్థితి అంత కొంపలు అంటుకుపోయే దుస్థితికి రాలేదు. మనము మన ప్రభుత్వము కూడ చాలా శ్రమపడి అధికాహారోత్పత్తికి చేయూతనిస్తూ యున్నాము.

అడిలి సాంబశివరావు (కలిదిండి)

### కథలు

'భయం' కథ ఆణిముత్యం లాగుంది. చాలా నెలల తర్వాత ఒక మంచి కథ చదివానన్న తృప్తి కలిగింది. కథ మొదలు పెట్టిన దగ్గరనుండీ చివరి వరకు ఏకబిగిన ఊపిరి పీల్చుకోకుండా చదివాను. కథలో ముందేం జరుగుతుందా అన్న ఆతృత—హిచ్‌కాక్ పిక్చర్ చూస్తున్నప్పుడు కల్గినంత ఆతృతలాగా — నన్ను కొరుక్కుతిన్నది. ఈ కథలో రచయితలుఉపయోగించిన టెక్నిక్—చివరలో ప్రశంశనీయంగా ఉన్నది.

కె. అరుణాదేవి (హైదరాబాద్—7.)

* * *

24—12—65 వ తేదీ సంచికలో ప్రచురించిన 'భయం' అను కథ చాల బాగున్నది. రచయితలు "రాంబాబు అండ్ శాయి" గారలకు మా కృతజ్ఞతలు. 'ప్రమాదం' అనే కథ గూడ బాగున్నది.

వేణుగోపాలరావు (పురుపల్లి)

* * *

"దేవుడినవ్వు"అనుకథ చాలా బాగున్నది. రచయిత శ్రీరంగంరాజేశ్వరరావు స్వానుభవము మీదే ఈ కథను వ్రాశారని అనుకొంటున్నాము. ఈ కథ చదువుచున్నచో నిజముగా దేవుడు నవ్వుచున్నాడా! అనిపించుచున్నది.

హాయ్యేటి, లక్ష్మి. (హైదరాబాదు)

### సీరియల్

మీరు ప్రచురించిన"పసిడిమనసులు"కథ మమ్మల్నెంతో ఆకర్షించింది. చివరివరకు చాల ఆత్రుతగా చదివాము. పాత్రల్ని సృష్టించటంలో రచయిత క్రొత్తదనం చూపించారు. రజనిపాత్ర మా అందరి హదయాల్లో నిలిచి పోయింది. ఇలాటి చక్కటికథ వ్రాసిన రచయితకు, ప్రచురించిన మీకు మా హృదయపూర్వక అభినందనలు.

రాజ్యం, కస్తూరి (తిరువొత్తియూర్)

పసిడిమనసులు సీరియల్ ముగిసినందుకు చాల సంతోషంగా వుంది.

రచయిత (త్రు) లకు ఈమధ్య కథాగమనానికి అడ్డు తగులుతారనుకున్న పాత్రలను చంపెయ్యడం ఒక దురలవాటు. ఈ విధానాన్ని ఉపయోగించిన తరవాత గూడ సీరియల్స్ (!) అంత పెద్దవిగా వుండడం శోచనీయం. పోనీ కొన్ని పాత్రలను చంపేశారు గదా అప్పుడైన కథ తొందరగా నడుస్తుందా అంటే, అదీ వుండదు.

ఆధునిక (?) నవలా రచయిత(త్రు)ల కున్న మరొక దురలవాటు ప్రేమాయణంలో మిగిలిన పాత్రలను నర్సులుగా చేరేట్లు చెయ్యడం (సాధారణంగా యిలా మిగిలిపోయేవారు స్త్రీలే అయ్యుంటారు. మగ నర్సు లుండరనో ఏమిటో మరి.)

ఇక నుంచయినా రచయితలు తమ నవలల్లో 'ప్రేమాయణంను' వీలయినంత తక్కువ మోతాదులో చిత్రించడం మంచిది. కథల్లో చిత్రించేటటువంటి త్యాగమూర్తులు నిజ జీవితంలో తారసిల్లడం చాల అరుదు.

కె. రాధాకృష్ణ (వాల్తేరు)

* * *

మీరు ప్రచురించిన "పసిడిమనసులు"సీరియల్ అయిపోయిందని తెలియగానే ఒకవిధంగాసంతోషము, ఒకవిధంగా బాధగాను వుంది.

హృదయ కుసుమాలు తర్వాత పసిడిమనసులు వ్రాసి శ్రీ హరికిషన్‌గారు తమయొక్క రచనానైపుణ్యాన్ని నిరూపించుకున్నారు. వారికి నాహృదయపూర్వకమైన ధన్యవాదాలు.

ఇటువంటి చక్కని నవలలుచదివి"రజని"లాంటి వాళ్ళు దేశానికి ఒక్కళ్ళు అయినావుంటే చాలా సంతోషిస్తాను.

పి. వెంకటేశ్వరరావు (ఆదోని)

### 'జయం మనదే'

ఒక ప్రక్క పాకిస్తానీయులు, మరో ప్రక్క చైనీయులు కలసి, భారతదేశాన్ని కబళించుకొనుటకు పొంచియున్నస్న ప్రస్తుత పరిస్థితిలో భారత మాత—ఆ కన్న తల్లి పిలుపు నందుకొని "మాకు దేశభక్తివుంది. మా దేశంకోసం కోటి రూపాయలు మించిన ప్రాణాలను సైతం త్యజించుటానికి సర్వదా సంసిద్ధుణ్ణి" అంటూ 'జయం మనదే' అను నినాదములతో, తనతోబాటు తన తోటి కళాకారులను కూడగట్టుకొని ఆంధ్రదేశమునకరిగి పలుచోట్ల, పలు విధములైన కార్యక్రమము లొసగి, తద్వారా ప్రజలవద్దనుండి దాదాపు ఎనిమిది లక్షల రూపాయల చెక్కును, ఈనెల 11 వ తేదీన హైదరాబాదులో జరిగిన అంతిమ కార్యక్రమములో భారత ప్రధాని శ్రీ శాస్త్రిగారికి, చెక్కు రూపములో సమర్పించి మరొక్కమారు తన సహృదయతను, దేశభక్తిని నిరూపించుకున్న ప్రఖ్యాత చలన చిత్ర నటుడు, నిర్మాత, దర్శకుడైన శ్రీ నందమూరి తారక రామారావుగారికిని, తనతోటి కళాకారులకును, ఇతర సాంకేతికులకును, నా హృదయపూర్వకమైన అభినందన లందజేయుచున్నాను.

బలభద్ర రామయ్య (మద్రాసు)

# అమ్మ సమయస్ఫూర్తి సహాయపడింది!

















## బాధ అనేది మాకు ఒక సమస్య...చూడండి మేము మీకు ఏవిధంగా సహాయపడతామో!

పరిశోధన: 'ఆస్ప్రో' యొక్క పరిశోధనా సంస్థలోని ఒక పరిశోధనా దళానికి నేను ఉపదేశకుడను. బాధను అపుజేయడానికి మంచి మంచి పద్ధతులను కనిపెట్టుట మా పని. ఈ విషయమును గురించి ఏకాగ్రతతో ప్రపంచమంతటా పరిశోధనలు జరుపుతున్న అగ్రగణ్యమైన పరిశోధనా సంస్థలలో మేము ఒకరము. నొప్పిని నివారించుటకు నేడు క్రొత్త మార్గము 'ఆస్ప్రో' ఫార్ములా అని మేము తెలుసుకొన్నాము. అందుచేతనే ప్రపంచమంతటా డాక్టర్లచేతను, ఆసుపత్రులలోను ఇది వాడబడుతోంది.

బాధ అంటే ఏమిటి? మెటాబొలిక్ ఉత్పత్తులు, దేహము వాటిని తీసుకొని పోగలిగే కంటె హెచ్చు వేగములో, స్నాయువులలో కూడుకొని చేరి పోవడం వల్ల మరుగుపడిన వాపు కలుగుతుంది. దానితో నరములకు ఒత్తిడి కలిగి బాధ కలుగుతుంది.

'ఆస్ప్రో' ఎలా పనిచేస్తుంది: 'ఆస్ప్రో' దేహములో వెంటనే యిమిడి, వాపును, నరముల మీద వత్తిడిని తగ్గించి నొప్పిని వెడలగొడుతుంది.

'ఆస్ప్రో'ను ఈ వ్యాధులకు వాడండి: నొప్పి • తలనొప్పి • ఒంటినొప్పి • పంటినొప్పి • కీళ్ల నొప్పి • జ్వరముతో కూడిన జలుబు • ఫ్లూ • కీళ్ల నొప్పులతో గూడిన జ్వరము.

మోతాదు: పెద్దవారికి: రెండు బిళ్లలు. అవసరమైతే తిరిగి వేసుకొనండి. పిల్లలకు: ఒక బిళ్ల లేక మీ డాక్టరు సలహా ప్రకారము వాడండి.




'ఆస్ప్రో'
నొప్పిని
వెడలగొడుతుంది!

-65 TEL.

# మనలో మాట

ఈ వారం వేసిన రెండు కథలూ పెద్దవే! అందులో 'మనిషి కోరేది మనిషినే' అనే కథకు 'మనోహన్‌దత్' అనే కొత్త చిత్రకారుడు బొమ్మ వేశారు. శ్రీ దత్ ప్రస్తుతం మద్రాసులోని 'స్కూల్ ఆఫ్ ఆర్ట్స్'లో చదువుతున్నారు.

* * *

మధ్య పేజీలలో కనిపించే 'దక్షిణాది ఆభరణాలు'—సచిత్ర రచన చాలా కాలం నుంచి చోటుకోసం ఎదురుచూస్తూ వుండిపోయింది. దీన్ని వేరే సందర్భంలో వేయాలని అనుకొన్నాం.... శ్రీ ఎస్. రామకృష్ణ మా పాఠకులకు పరిచితులే.

* * *

పోయినవారం 8వ పేజీలో సోమర్సెట్ మామ్‌ను గురించి వ్రాసిన దానిలో ''మాకు అవకపోలేదు'' బదులు ''మామ్‌కు లేకపోలేదు'' అని చదువుకో వలసినదని కోరుచున్నాము. పొరబాటు దొర్లినందుకు చింతిస్తున్నాము.

* * *

'సినిమా'లో కొత్తతరహా రచనలను అందించే ప్రయత్నం చేస్తూనే వున్నాం. ఈ వారం ప్రచురించిన సినిమాల్లో జంతువులు, మహారాజావారితో షూటింగ్—అనే రెండు రచనలు ప్రత్యేకమయిన కృషితో తయారయినవే.

శ్రీ వి. ఎస్. సుక్‌తాంకర్ లోగడ ఒక సంచికలో 'శాంతాఆప్టే' గురించి వ్రాశారు.

* * *

'సంక్రాంతి సంచిక' శరవేగంతో తయారవుతోంది. కొత్త కొత్త వ్యాసాలు, ప్రత్యేకమయిన రచనలతో, యీ సంచికను వెలువరిస్తున్నాము.

ఈ సంచిక 15వ పేజీలో ముఖ్యమైన 'మనవి' ఒకటి చదువుతారు. ఈ విషయమై మా పాఠకులు, ఏజెంట్లు సహకరించగలరని ఆశిస్తున్నాము.

# విషయానుక్రమణిక


ముఖచిత్రం: నటి జయంతి (ఫోటో: ప్రభాకర్)

కథలు:

మనిషి కోరేది మనిషినే — 10

ఒడనిపోని మనిషి — 26

సీరియల్ కథ:

తరుణి 18

శీర్షికలు: వ్యాసాలు: సినిమా.

ఉత్తరాలు — 2, ఉమెన్ కార్టూన్ — 6, మ్యాడిల్లీలేఖ — 7, నియంత ప్రణయాల నిజ స్వరూపం — 9, వైజ్ఞానిక గాథాశతి — 16, వారఫలం — 23, దక్షిణాది ఆభరణాలు — 24, పుస్తకాలు—43, సినిమాల్లో జంతువులు—44, మహారాజావారితో షూటింగ్ — 45, సినిమా వార్తలు — 46.



# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు:
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం: 7-1-'66
విశ్వావసునామ సం॥ పౌష్య మాస శుద్ధ పౌర్ణమి
సంపుటము: 58 సంచిక: 19
స్థాపితము:
1908

ముఖ్య సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు:
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీథి, మద్రాసు-1


క్రొత్త రేట్ల ననుసరించి 14-1-1966 మొదలు ఆంధ్రసచిత్ర వారపత్రిక చందా వివరాలు.

భారతదేశం

| | పోస్టుద్వారా |
|---|---|
| | రూ. పై. |
| సంవత్సర చందా | 19.25 |
| 6 మాసముల చందా | 9.62 |
| 3 మాసముల చందా | 4.80 |

ఇతర దేశాలకు

ఓడమీద (Sea Mail)

| | |
|---|---|
| సంవత్సరం చందా | 24.50 |
| అర్ధసంవత్సర చందా | 12.25 |

**వచ్చేవారమే:**

'ఇంగ్లీషు సినిమా' పేరు వినగానే మన కెన్నో అర్థాలు స్ఫురిస్తాయి. అక్కడి తారల తీరులు, వారి దైనందిన జీవితాలను గురించి మనం ఎన్నో వూహిస్తాం!

కాని, యివన్నీ ఎంతవరకు నిజం? ఈ తారలు 'విడిగా' ఎలా వుంటారు? 'తెరవెనుక' వీరు ఎలాంటి జీవితాలను గడుపుతుంటారు?

...మొదలయిన ప్రశ్నలకు, సమాధానాలు తెలిపే సచిత్ర వ్యాస శీర్షిక తయారవుతోంది!

ఇది ఆంధ్రసచిత్రవారపత్రికకు

**ప్రత్యేకం!**

# హమామ్ వల్ల హాయిగాను కాంతిగాను వుండండి

శుభ్రపరచునట్టియు, శరీర కాంతి నిచ్చునట్టియు హమాము సబ్బును ప్రతి దినమూ వాడండి. మంచి సువాసనగల, సమృద్ధియైన హమాము నురుగు మీ శరీరమును శుభ్రపర చటమేగాక చలకన పరచును—మీకు మంచి తేజస్సు నిచ్చు యీ సబ్బును ప్రతి రోజూ వాడి చూడుడు—దాని సుగుణము మీరే తెలుసుకొనగలరు—హమామునే వాడండి. చాలా రోజులువచ్చే హమాము—ఎల్లప్పుడూ మెత్త బడకుండు హమాము టాయిలెట్ సబ్బు. హమాము ఒక టాటా ఉత్పత్తి.




CBIH-2 A TEL

# 1966 లో!



శాస్త్రి గౌరవ ప్రతిష్ఠలు పెరుగుదల




రష్యా చైనాల మధ్య భేదాభిప్రాయాలు




రష్యా
ఇదిగో దీన్ని మింగేయి!






పాకిస్తాన్
ఇతరుల కీచులాటల్లో రష్యా ప్రవేశం




చైనా




అధికారంలో లేబర్ పార్టీ బాధలు




ప్రపంచంలో కోపతాపాలు తగ్గవు!




డీగాల్ ఓటమికి అవకాశాలు

# విదేశీ సహాయం ఎంతో అవసరం!

ఈ కోరిక విన్న సర్దార్ వల్లభాయ్‌పటేల్ విస్మయకరంగా వీలుకాదని చెప్పాడు. కాని సర్దార్‌జీ చనిపోయాక ఢిల్లీ నగరానికి శాసన సభతోపాటు మంత్రివర్గం కూడా లభించింది. కాని ఈ ప్రయోగం వైఫల్యం చెందింది. ఇంతలో రాష్ట్రాల ప్రజాస్వామ్యాల మనస్థిరత్వం జరగటం, ఉత్తరాది రాష్ట్రాలు ముగ్గురు కావటం, దక్షిణాదికి ఆశాభంగం మాత్రమే మిగలటం జరిగింది.

కాంగ్రెసు మంత్రులకు పుస్తకాలు చదవాలి, చరిత్ర సంగతులు తెలుసుకోవాలనే కుతూహలం తక్కువేను. పుస్తకాలు చదవటంవల్ల ఏమి ప్రతిఫలం కింపవరమకోవ లభిస్తుందని వీరి భావన. అందువల్లనే 1911లో రాజధానియాకు ఢిల్లీ ఎలా రాజధాని అయిందో, వాషింగ్టన్‌కు లెజిస్లేటివ్ అసెంబ్లీ ఎందుకుండదో— వీరికి తెలియదు. వీరికున్నదల్లా ఒకటే ఆశ. భగవంతుడి దగ్గర్నుంచి ఆహ్వానం వచ్చేవరకూ అధికారంతో ముసిగితేలాలని.

అధికారం మనిషిని ఎంత దూరమైనా తీసుకు వెడుతుంది. అలాంటి అధికారం మనిషికి బహుకాలంగా ఉంటే దాని పరిణామాలు ఎంతో ప్రమాదకరంగా ఉంటాయి. కాంగ్రెస్ రాజ్యంలో సరిగ్గా అదే జరుగుతూంది. త్రిశంకు స్వర్గాన్ననుభవిస్తున్న కొందరు గవర్నర్లు, మంత్రులే దీనికి ఉదాహరణ. పంజాబ్ గవర్నర్ హాఫీజ్ మొహమ్మద్ ఇబ్రహీం కొంతకాలంగా అస్వస్థతతో ఉన్నారు. ఆయన సెలవు పెట్టిన కారణంగా సర్దార్ ఉజ్వల్‌సింగ్ ఆయన స్థానంలో తాత్కాలికంగా ఉంటున్నారు. ఎవరైనా సెలవుపెడితే న్యాయంగా వారు తమ ఇండ్లకు వెళ్ళాలి. కాని శ్రీ హాఫీజ్ వెళ్ళలేదు. ప్రభుత్వ భవనంలోనే ఉంటున్నారు. తాత్కాలిక గవర్నరు వేరే గెస్ట్‌హవుస్‌లో ఉంటున్నారు.

1947 నుంచి సామాన్య భారతీయులు చెల్లించే పన్నులమీదనే బ్రతుకుతున్న ఇలాంటి పెద్దలకు కనీసపు మర్యాదైనా తెలియకపోవడం శోచనీయం. ఈ విషయమై గట్టిగా చెప్పే కాంగ్రెసు వాదులు కూడా మన దేశంలో లేరా?

ఇలాంటి అస్తవ్యస్త పరిస్థితి నడుమ కాలక్షేపం చేస్తున్న చాలమందికి పత్రికల్లో పేరు చూసుకుని మురిసిపోవడం బాగా అలవాటయిపోయింది. ఈ స్థితికి పత్రికలది కూడా బాధ్యత లేకపోలేదు. మన దేశంలో డిప్యూటీ మంత్రులకు కూడా ఎంతో ప్రచారం ఉంది. ఇలా మరో దేశంలో ఉండబోదు. ఈ ఉపన్యాసాలన్నిటిని ప్రకటనలుగావేస్తే పత్రికలకు కొంత డబ్బైనా వస్తుంది.

రాజ్యాంగప్రకారం రాష్ట్రపతిలాంటి వ్యక్తి కూడా కనిపించాలేకాని వినిపించకూడదు. ఆయనకు అవసరమైన ఉపన్యాసాలు కూడా పరిపాలనా విభాగంలోనే తయారు కావాలి. విధానాలని రూపొందించే బాధ్యత ప్రభుత్వానిదే. నైరాశ్యా అనంతరం రాష్ట్రపతి కనీసం రోజువిడచి రోజైనా వార్తల్లోకి వస్తున్నారు. విదేశాల్లో పర్యటన చేస్తున్నపుడు కూడా సంయుక్త పత్రికా ప్రకటన చేయటానికి రాష్ట్రపతికి మన ప్రభుత్వ పాలనా విధానం అధికారమిచ్చింది.

ఇదిలా ఉండగా విదేశీ సహాయం లేకుండానే మన దేశాన్ని అభివృద్ధి చేసుకోవచ్చుననే వాదన ఒకటి ఉధృతమవుతున్నది. కాని నాల్గవ ప్రణాళికలో మూడువేలకోట్ల రూపాయల మేరకు విదేశీ సహాయం లభిస్తుందని, అంచనా వేయటం జరిగింది. అమెరికా తన సహాయాన్ని నిలిపివేయటం మూలంగా భారతదేశంలో ఆర్థికరంగంలో ప్రగతి ప్రతిష్టంభించిపోయిన ఉదంతం కూడా లేకపోలేదు.

ఎవరు ఎవరిని మోసం చేస్తున్నదీ ఎవరికీ తెలియటంలేదు. కనీసం 1977 వరకైనా



ఎర్నీన్ షూమాకర్

# నియంత ప్రణయాల నిజస్వరూపం



బెర్లిన్ సభలో సుకర్నో ప్రసంగం

సుకర్నోకి ఇద్దరు ముఖ్య శత్రువులు.

ఒక శత్రువు అతని అనారోగ్యం. ఈ 64 సంవత్సరాల నియంత మూత్రపిండాలు చెడిపోయాయని డాక్టర్లు అంటారు.

రెండవ శత్రువు అతని అనుచరులు కొందరు అతనిని గురించి సేకరిస్తున్న సమాచారపు సాక్ష్యం, అతని ప్రణయాల వికార స్వరూపాల వివాదాలు, అతని ఆర్థిక పరిస్థితి వివరాలు. ఈ సమాచార సేకరణ గురించి సుకర్నోదగ్గిర నేను పనిచేస్తున్నప్పుడే తెలుసుకున్నాను.

సుకర్నో రెండవ భార్య హరిని దుబారా ఖర్చులకి డబ్బు ఎక్కడినుంచి వస్తోంది? సోనర్జో అనేఒక వ్యాపారి చెప్పగా విని తెలుసుకున్నాను. అతన్ని పై ప్రశ్న ఒక ఇండొనేసియన్ అధికారి అడిగాడు. ముందు తనకి తెలియదన్నాడు సోనర్జో.

తర్వాత బయట పడిన నిజం వియన్నా దగ్గిర ఒక చక్కటి బంగళాలో ఒక అందమయిన 'కవుంటెస్!' చాలా దర్జాగా బతికేది. ఆమెని సుకర్నో భరించేవాడన్నమాట. ఈ వనిత నిజానికి ఒక గూఢచారిణి. ఈ సంగతి తెలిసినా, ఇండొనేసియన్ అధికారులు, జరిగినంత జరగనీ, మనకి కావలసిన సమాచారమూ ... కున్నారు. ఈ రకం సందడిలో కొందరు వ్యాపారులు తమకి వీలయినంత లాభాలు చేసుకునేవారు.....

ఒకసారి ఒక వియన్నా డిన్నర్ పార్టీలో సుకర్నో పక్కన ఒక అందమయిన వనిత కూర్చునిఉంది. భోజనం మధ్యలో సుకర్నో ఆమె పాదాన్ని తరుచు తొక్కటం మొదలు పెట్టాడు. పాపం, ఆమె తనకోసం ఏర్పాటు చేసిన మనిషి అనుకున్నాడు! ఆమెకోపం పట్టలేక తన అభ్యంతరాన్ని బహిరంగంగా తెలిపింది. పార్టీ పెద్ద రభసతో ముగిసింది. ఈ సంఘటన తర్వాత సుకర్నో చాలా దుడుకుగా ప్రవర్తించి ఆస్ట్రియన్ ప్రభుత్వాధికారులకి చాలా ఇబ్బంది కలిగించాడు.

ఇదంతా ఇంతటితో ఆగలేదు. 1961 ప్రారంభంలో ఒక చైనా దేశం మనిషి వడిపే హొటల్‌లో వంట బాగుంటుందని విని అక్కడికి వెళ్లాడు. భోజనం చాలా రుచిగా ఉంది. సుకర్నో సంతోషం పట్టలేకహొటల్ యజమానినీ, అతని భార్యనీ, పిల్లనీ పిలిచి తన ఆమోదం తెలియచెయ్యాలనుకున్నాడు. తెలియచెయ్యటమేకాక 14 సంవత్సరాలపిల్లని ప్రత్యేకంగా పొగడి తనవెంట షికారు తీసుకుపోయాడు. రాత్రంతా ఆమెని తనతోనే ఉంచుకున్నాడు. పిల్ల తండ్రి మీద సుకర్నో ... అధ్యక్షుడి మీదకేసు పెట్టటం తేలిక పని కాదు. రాయబారవర్గాలు ఎన్నో చర్చలు జరిపాయి. చివరికి చేసేదిలేక పిల్లతండ్రి నిజాన్ని బయట పెట్టాలని కథంతా ఒక పత్రికలో వేయించాడు.

ఇటువంటి కథలు ఎన్నో ఉన్నాయి. అన్నీ పైన చెప్పిన ఇండొనేసియన్ అధికారవర్గాల 'ఫైల్' లో ఉన్నాయి.

సుకర్నో ప్రణయ లీలలు విదేశాలలోనే కాక ఇండొనేసియాలోనూ, కొంచెం తీవ్రంగా జరగటంతో అతని శత్రువుల సంఖ్య పెరిగిపోవటంలో ఆశ్చర్యంలేదు. ఒక పెద్ద అధికారి భార్యమీద మనసు కలిగి, ఆమె తిరస్కరించేసరికి ఆమె భర్తని విదేశాలకి బదిలీ చేయించాడు.

విచిత్రం ఏమిటంటే సుకర్నో తనకి తనే అంటాడు: "నాది వింత స్వభావం. నేను మిధునరాశిలో పుట్టాను. అన్ని రకాల ఆదర్శాలూ, ఆశయాలూ నాలో మిళితమయ్యాయి...."

కాని ఒక ఇండొనేసియన్ అధికారి ఇలా అన్నాడు: "సుకర్నోతో వచ్చిన చిక్కు ... టంటే, ఆయన ఎవరు చెప్పింది వినిపించుకోడు....."

# మనిషి కోరేది మనిషే




"సత్యమేవ"

పిండారీదండులా, ధవళాకాశాన్ని కమ్మివేశాయి నల్లటి మబ్బు తునకలు. దురాశాపరుని మనస్సులా తమస్సు వికలంగా ఉంది. ఉండీ, ఉడిగీ, ఉరుమూ, మెరుపూ, చినుకూ. నిశాకాంత 'భోరు'మనీ ఎప్పుడైనా 'ప్రవవించ'వచ్చునని హెచ్చరిస్తున్నాయి.

స్టేషన్లో హెచ్చు తరగతుల వెయిటింగ్ రూమ్ ఖాళీపడిపోయి 'బావురు'మంటున్నది. అక్కడక్కడా పడిన పేపరు ముక్కలూ, అరటిపండ్ల తొక్కలూ, క్షణాల క్రిందటి జనసమ్మర్దాన్ని గుర్తుకు తెస్తోంది. పేము సోఫాకు, గోడకూ మూల వో బిక్కచిక్కిన కుక్క 'ఇంతలో చిమ్మే కుర్రవాడురాకుండా ఉంటే బావుణ్ణు!' అన్న ఆలోచనతో కాబోలు బిక్కు బిక్కుమని చూస్తోంది. అంతకు మించి అక్కడ ప్రాణసంచారంలేదు. స్టేషన్

ఆవరణకు అవతల కిళ్లీకొట్టులోని రేడియోలో 'ఈనాటి ప్రసారం ఇంతటితో సమాప్తి' అంటూ జనగణమన....' ప్రసారం జరుగుతోంది.

సన్నగా చినుకుతోన్న చినుకుల్లోంచి కండువా నెత్తిమీద వేసుకుని లోనికి ప్రవేశించాడు జానకిరామయ్య. తనెప్పుడూ జనతా క్లాసుకుమించి ప్రయాణం చెయ్యకపోయినా, 'నలుగురూ వాడుకునే రూము మనం వాడుకోవడంలో తప్పేముంది? అథవా, ఖాకీకోటు మనిషి ఎవరన్నా వచ్చినా, పెద్దవాణ్ణి, నన్నేమి అనగలడు కనక?'' అన్న భరోసాతోనే లోనికి వచ్చాడు.

'తనకోసమే వేశారా' అన్నట్లు, ఆహ్వానిస్తోన్న ఈజీచేరులో, కాళ్లు ఝాడించి తృప్తిగా, దీర్ఘంగా మేనువాల్చాడు జానకిరామయ్య. 'నీటి దుంపతెగ వెధవ బండ్లు ఎప్పుడూ ఇంతే!.....బండిదిగితే బండి అందుతుందన్న ఆశలేదు, కదా పూ కాలంలో...., అని గుంటూరుబండి తప్పిపోయినందుకు మండిపడుతూ, 'అయినా ఎప్పటికయినా బండి రాకపోతుందా కొంప చేరకపోతానా?' అన్న ఆశాభావంతో రెప్పలువాల్చాడు జానకిరామయ్య.

వృద్ధాప్యంలో అసలే సుందగించిన నిద్ర, ఈ వాతావరణానికి అసలే రాలేదు. పైగా నడుం వాల్చేముందు ఆయన అధమం అర్ధగంటయినా, సిప్పాపాటీ మాట్లాడి ప్రపంచ పరిస్థితులు సమీక్షించనిదే నిద్రపోలేడు. కాగా దేశంలో ఎక్కడ చూసినా ఉద్రిక్త పరిస్థితులూ, సరిహద్దుల్లో సంకులసమరం! అంచేత ఉట్టినే కళ్లు మూసుకున్నాడు.

అప్పుడే వెళ్లిపోయిన 'మెయిలు'కు దిగిన పేపర్లుచ్చుకుని, పేపరు కుర్రవాళ్లు 'ఆ రేపటి పేపరు, తాజా యుద్ధవార్తలు...' అంటూ కేకలేస్తున్నారు. జానకిరామయ్య పేపరు కుర్రవాణ్ణి పిలిచి ఉత్సాహంతో పేపరు కొన్నాడు. అందులో పెద్ద అక్షరాలతో "సుబేదార్ బిగత్‌సింగు వీరోచితగాథ' అంటూ 'బాక్స్'లోవేసి ఉంది. 'శత్రుమూకలు ఈగల్లా ముసురుకున్నా తన సహచరులందరూ నిహతులై, తను ఏకాకి అయిపోయినా, ధైర్యం వీడకుండా, ఉపాయంతో వాళ్లను కొండ చెరియమీదనుంచీ క్రిందకు పడిపొయ్యేలా చేసి, మళ్లీ సహాయం అందేవరకూ స్థావరం నిలబెట్టుకున్న వీరుడు భగత్‌సింగ్' అంటూ మిగతా వివరాలతో సుబేదార్ ఫోటో కూడా ప్రచురించి బడిఉంది.

జానకిరామయ్యకు ఆపాదమస్తకం పులకించినట్లయింది. సుబేదార్ భగత్‌సింగ్ ఫోటో కేసి తదేకంగాచూస్తూ ఉండిపొయ్యాడు. అప్రయత్నంగా ఆయన కండ్లలో నీళ్లు నిండుతున్నాయి.

ఇంతలో 'టక టక' మన్న బూట్ల చప్పుడు వినవచ్చింది. ఆయన రెప్పలెత్తి చూశాడు. కావడిపెట్టెలాంటి ఓ పెద్ద పెట్టె, బెడ్డింగ్ రైల్వే కూలీ నెత్తిపై పెట్టి, మాంచి మిలిటరీ యూనిఫారమ్‌లో ఆజానుబాహుడైన ఓ యువకుడు వెయిటింగ్ రూమ్‌లోకివచ్చి, కూలీకి ఉర్దూలో ఏదో హుకుం జారీ చేస్తున్నాడు.

మిలిటరీ మనిషి రాకతో వెయిటింగ్ రూమ్ మళ్లా సజీవమయినట్లయింది. ఆ మనిషి 'టక్, టక్' శబ్దం చేసుకుంటూ వేటికోసమో వెతికి, బాత్‌రూమ్‌లోకి వెళ్లి వచ్చి, జానకిరామయ్యగారికి ఎదురుగా ఉన్న ఈజీచేరులో తాపీగా పడుకున్నాడు.

మిలిటరీ మనిషికేసి వోమారు చూశాడాయన. మాంచి కండపుష్టి కలిగి, ఆజానుబాహువయిన విగ్రహం, కొరడాలాంటి మీసకట్టు, పచ్చికొబ్బరికాయనుకూడా 'ఫడేల్' మని ఒక్కదెబ్బకు పగులగొట్టగల బాహుపుష్టి, చేతులో 'బేటన్'. నలగని యూనిఫారమ్‌లోఉన్న ఆ యువకుడు, నీరసం, ప్రాలుమాలికలతో సతమతమవుతోన్న జానకిరామయ్యకు వో మహాపురుషునిలా కనుపించాడు.

'ఎవరో ఉత్తరాది రాజపుట్, బెంగాలీ, లేక సింధీ అయుంటాడు' అనుకున్నాడు. వోమారు పలకరించాలని బుద్ధి పుట్టింది కాని, మిలిటరీవాళ్లు కరకుగా, కత్తివేటులా మాట్లాడుతారని, మాట జారితే తాను బాధపడవలసివస్తుందన్న అభిప్రాయంతో సందేహిస్తున్నాడు.

అయినా క్షణాలు గడిచేకొద్దీ, ఆ యువకుణ్ణి పలకరించి సంగతి సందర్భాలు తెలుసుకోవాలని జానకిరామయ్య మనసుపడ్డాడు. ఆయన అడగదలచుకున్న విషయాలు చాలా ఉన్నవి. ఎక్కడ, ఏ సరిహద్దుల్లో పని చేస్తున్నాడో, నిజంగా యుద్ధరంగంలో పాల్గొనే తరగతికి చెందినవాడో కాదో, ఇంతకుముందు ఏయేరంగాల్లో పాల్గొన్నాడో వగైరా విషయాలన్నీ తెలుసుకోవాలి. కాగావ్యక్తిగతంగా శత్రుత్వంలేనివాళ్లమీద చంపగలిగేంత ద్వేషం ఎలా కలిగేది—శత్రువు కొనవూపిరితో కొట్టుకలాడుతున్నా 'బేయొనెట్' అతని గుండెల్లోకి గ్రుచ్చివేసి పూర్తిగా చంపుతారట. ఇది ఎలా సాధ్యం అయేదీ, ఇత్యాది విషయాలన్నీ అడిగి తెలుసుకోవాలని ఆదుర్దా పడ్డాడు. కాని తీరా పలకరిస్తే ఆ మనిషికి తెలుగూ, ఇంగ్లీషు రెండూ రాక 'క్యాబోల్'? అంటూ తన్ను ప్రశ్నిస్తే దిక్కుపడవలసి వస్తుంది. ఎలా చేయడం?' అన్న మీమాంసతో మిలిటరీ మనిషి వేపు తదేకంగా చూస్తూ ఉండిపొయ్యాడు జానకిరామయ్య.

"ఏమిటి చూస్తున్నారు?'' అన్నాడు మిలిటరీ మనిషి, మీసాలక్రిందుగా నవ్వుతూ.

ఆ అనుకోని పరిస్థితికి జానకిరామయ్యగారు క్షణకాలం ఇట్టే అయ్యారు.

"ఆ....ఆ.... ఏంలేదు... మిమ్మల్నే..... చిన్నవాడివికాబట్టి 'అబ్బాయీ' అంటాను. నీకు అభ్యంతరం లేదనుకుంటాను..'' సందేహిస్తూ అన్నాడు.

"లేదు....మీరు పెద్దవారు, ఎలాగయినా అనవచ్చు......'' స్వరంతో మిలిటరీ కర్కశత్వం ఉన్నా మాటల్లో మర్యాద కనుపించింది.

"నీకు తెలుగు వచ్చునన్నమాట!... మనవాడివే నన్నమాట.....'' అంటూ హాయిగా తృప్తిగా నవ్వాడు జానకిరామయ్య.

"ఆ! మనవాణ్ణే. ఏం కథ?'' అన్నాడు యువకుడు మెల్లగా, పొడిగా నవ్వుతూ.

"మనవాడివే, మన తెలుగువాడివే, అయితే శుభం...అబ్బాయీ నీకు నా ఆశీస్సులు!....'' అన్నాడు ఈజీచేరులో రికామీగా [illegible]వాడల్లా సావధానుడవుతూ.

"సంతోషం, థాంక్స్'' అన్నాడు యువకుడు.

"అబ్బాయీ, యోగ్యుడివి కూడా, నిజంగా మన తెలుగువాళ్లూ ఎద్దుల్లా తినిమెద్దుల్లా ఉండటానికి తప్పితే పనికిరారని నేను అనుకుంటూ ఉంటాను. ఎక్కడో తప్పితే, శౌర్య ధైర్యాలు కలిగిన సాహసవంతులు అగుపించరు. అట్లాంటిది నీలాంటివాళ్లు ఆర్మీలోకి వెళ్లి దేశాన్ని రక్షిస్తున్నారంటే, నిజంగా నాకెంతో గర్వకారణంగా ఉందబ్బాయీ......''

యువకుడు మళ్లా పొడిగా నవ్వు పూసుకున్నాడు జానకిరామయ్యను కించిత్తు 'స్టడీ' చేస్తూ!.

"నీపేరూ, వూరు, నీవెక్కడ పనిచేస్తున్నదీ, అక్కడ విశేషాలు—అడక్కూడదు కాని ఇప్పుడు ఎక్కడకు వెళుతున్నదీ, కాస్త వివరాలు చెప్పునాయనా...... చెవుల తుప్పు వదిలేలా!'' అన్నాడు.

"దానికేంతేండి, మీ పేరు?''

"జానకిరామయ్య, రామయ్య, రామన్న అని కూడా అంటారు.''

"వూరు?"

"ఇక్కడే, ఒంగోలు తాలూకాలో ఒక చిన్న గ్రామం."

"మీరేం చేస్తుంటారు?"

"హమ్మా, ఘట్టివాడివే! ఏ వివరాలు చెప్పకుండానే, నానోట నా సంగతంతా కక్కించావు! నిజంగా ప్రైమ్ మినిస్టర్ కాదగిన వాడివయ్యా!...."

"నాకు తెలుగు వచ్చు కాబట్టి తెలుగు వాళ్లతో కలుపుకున్నారు మీరు......నిజంగా మీది స్వార్థం అంటాను" సద్భావంతోనే నవ్వుతూ అన్నాడు.

"ఏమీ, నీవుతెలుగువాడివికావా? కాక పోతే ఇంత చక్కగా తెలుగు ఎవరు మాట్లాడ తారయ్యా, ఏమయినా మావాడివే, తప్పదు" శాసిస్తున్నట్టన్నాడు జానకిరామయ్య.

"అయినా నావివరాలు తెలుసుకోవాలని మీకెందుకంత కోరిగ్గా ఉందో నాకు తెలుసుకోవాలని ఉంది."

"అబ్బాయీ, అడుగుతావా? మిలిటరీ లోకి వెళ్లి సేవచేసేవాళ్లంటే నాకు మొదటినుంచీ ఎంతో అభిమానం, ప్రేమా, గౌరవమూను. ఈనాడు దేశాన్ని రక్షిస్తున్నదెవరు? మరునిముషంలో తాము ఏమవుతామో అన్న ఆలోచనకు తావు

# మనిషికోరేది మనిషినే

రానీక, భార్యాబిడ్డల్ని ఎక్కడో వదలి, కాని దేశంలో, కాలుపెట్టలేని శీతోష్ణ స్థితుల్లో, కంటిలో వత్తివేసుకొని కాపలా కాస్తున్నది మీరుకాదా? నీడపట్టున నివికిపోయిన మాలాంటి వాళ్ళకేం తెలుస్తుంది మీరు చేసేత్యాగం?..." అంటూ కొంచెం ఆగి "త్యాగం' అన్నాను, కాని తాత్త్వికంగా చూస్తే, అదే భోగమంటాను. దేశాన్నిరక్షించే భాగ్యం భోగంకాదా?"అంటూ ఉద్రేకపడిపోయాడు జానకి రామయ్య.

"నిజంగా మీరు గొప్ప దేశభక్తులు!" అన్నాడు యువకుడు.

"నన్ను ఉద్రేకపరచకుండా, నీవిషయా లేందో చెప్పు నాయనా" అర్థిస్తున్నట్లన్నాడు.

"నేను హవల్దారును, ఈ బుజంపై ప్రక్కగాఉన్న తెలుపు గీతలు సూశారా, అవి మా 'రాంక్' చిహ్నాలు. ఇదివరకు 'జ్యోషిమత్'లో పని చేస్తుండేవాడిని. ఇటీవలే 'పూంఛ్ డివిషన్'కు మార్చారు. సరిహద్దులో పరిస్థితి ఉద్రిక్తంగా ఉందని, సెలవు కాన్సిల్ చేసి, 'రికాల్' చేశారు మమ్మల్ని, ప్రభుత్వంవారు. అందుకే వెడుతున్నాను."........

"ఏమిటేమిటీ?, సాక్షాత్తు యుద్ధ రంగానికే వెడుతున్నానన్నమాట! విజయోస్తు! అబ్బాయీ, నిన్ను చూస్తే, నాఒళ్లు పులకరిస్తున్నది. దుండగులను తరిమికొట్టి, మట్టుపెట్టి, మాతృ దేశ గౌరవం నిలబెట్టు నాయనా. ఆంధ్ర దేశం అంటే ఆవకాయ, గోంగూర పచ్చడి మాత్రమే కాదని బుజువుచెయ్యి. రాజపుత్రులూ, శిఖ్ఖులూ, గూర్ఖాలూ, మరాఠీలకు ఉన్నపేరు మన తెలుగు జాతికీ కూడా సంపాదించిపెట్టు. దేశంలో అంగుళంకూడా పరాధీనం కానివ్వవద్దు.... నిజంగా నిన్ను చూస్తుంటే ఉన్నపాళంగా నీతో లేచివద్దామని అనిపిస్తోంది. అయితే ఏం చెయ్యను! అశక్తుణ్ణి! వృద్ధుణ్ణి, అందుకనే ఓ నవకవి "ఎముకలు" కుళ్ళిన వయస్సుమళ్లిన సోమరులారాచావండి"అంటూ తిట్టి పోశాడట!...... భావోద్రేకంతో కదలిపోతూ అన్నాడు జానకిరామయ్య..

"నిజంగా మిలటరీవాళ్లంటే మాకు ఎంత గౌరవమండీ!.

"అబ్బ, ఆపాడుముక్కలు—'మిలిటరీ వాళ్లే'వీంటి ఏదో 'గోపిడి'వాళ్లను అన్నట్లు దేశరక్షకులు, దేశమాత అనుంగుపుత్రులు త్యాగులు, భోగులు, అనాలి. ఇక్కడే ఈ పేపర్లోచూడు, సుబేదార్ భగత్‌సింగ్ అద్భుతమైన వీరగాథ! జాతి రత్నాలనదగ్గ ఇలాంటి వాళ్ళు నలుగురుంటే చాలదూ? 'పనముత్యమొకటి చాలును, కనవూడ్చిన చింపిరాలు గంపెడేలా! అంటూ వూరికే అన్నారా? మావెనక తరంలో ఒకాయన 'బోయరు'యుద్ధంలో ఇలాంటి సాహసమే చూపించాడు నాయనా......" ఏదో స్మృతికి తెచ్చుకుంటున్నట్లున్నారు.

"ఏమోలెండి మమ్మల్నంతా ప్రజలో చావబోతున్న వాళ్ళలా చూస్తారు. ఒకరూ పిల్లను ఇవ్వడానికూడా ముందుకు రారు కదా! మిలిటరీవాడంటే 'నేడేచూడండి, రేపుండడు' అన్నభావంతో చూస్తారు."

ఛీ, ఛీ, దవడపళ్లు రాలకొట్టాలి, అట్లాంటివాళ్లను వట్టి వాజమ్మలంటాను."

"పేరు షణ్ణానకీర్తుల బరగనేని, అట్టి జన్మంబు ఒక ఘడియయైనచాలు"అంటూ వూరికే అన్నారా, పెద్దవాళ్లు?.... అయినా అలాంటి మూర్ఖుల అభిప్రాయంతో మన కేంపని?.

నిజంగా మాజవాన్ల పట్ల మీకుండే సద్భావానికి నాకెంతో ఆనందంగా ఉంది







"తల్లివి కాబోతున్నావు నువ్వు. ఇద్దరి తిండి తినాలి మరి"

రోజూ ఒక్కో
# ప్రీనేటల్
కేప్స్యూల్
వేసుకో!

'ఆమె ఆరోగ్యం కోరి అమ్మ చెప్పిన మాటలో ఎంత అనుభవం వుంది! ఎందుకంటే కడుపులో బిడ్డ తల్లి నుంచే తన పోషకాహారాన్ని తీసుకుంటుంది. తల్లికీ, బిడ్డకీ కావలసిన అత్యవసర పదార్థాలు నిత్యమూ తినే తిండిలో లభించక పోవచ్చు. అందుకనే రోజూ ఒక్కో ప్రీనేటల్ కేప్స్యూల్ వేసుకోడం చాలా మంచిది.

ప్రీనేటల్ కేప్స్యూల్ సుగుణాలేవిటో డాక్టర్లందరికీ తెలుసు. ఎనిమిది రకాల విటమినులూ, నాలుగు రకాల ఖనిజ పదార్థాలూ సరైన పాళ్లలో కలిపి, తల్లికీ, బిడ్డకీ కావలసిన ఈ పోషకాహారాన్ని లెడర్లీ కంపెనీ ప్రత్యేకంగా తయారు చేసింది.

ఒక్కో ప్రీనేటల్ కేప్స్యూల్ వేసుకుంటే చాలు. నిత్యమూ అవసరమైన పోషక పదార్థాలు లభిస్తాయి... వెల 15 పైసలు మాత్రమే.

*ప్రతి ప్రీనేటల్ కేప్స్యూల్ లోనూ బిడ్డ ఆరోగ్యానికీ, తల్లి క్షేమానికీ చాలా అవసరమైన ఎనిమిది రకాల విటమినులూ, నాలుగు రకాల ఖనిజ పదార్థాలూ వుంటాయని గుర్తుంచుకోండి. వీటివల్ల శరీరానికీ ఎముకలకీ, రక్త నాళాలకీ ఎంతో మేలు కలుగుతుంది; రోగ నిరోధక శక్తి కలుగుతుంది.*

ప్రసవానికి ముందు తీసుకోవలసిన జాగ్రత్తను గురించి తగిన సలహాలిచ్చే ఉచిత కరపత్రం ప్రతి కావాలంటే సయానమిడ్ ఇండియా లిమిటెడ్, పోస్టు బాక్సు నెం. 195, హైదరాబాద్-1 కి వ్రాసిగాని, మీ మందుల షాపులో గాని తీసుకోవచ్చు.

శుభస్య శీఘ్రం! ఆవాళ్టి నుంచే
## ప్రీనేటల్
కేప్స్యూల్
వేసుకోడం ఆరంభించండి. రోజుకు ఒక్కటి చాలు!




Lederle లెడర్లీ డివిజన్, సయానమిడ్ ఇండియా లిమిటెడ్

CMCP1276

మీ ఆంధ్రదేశంలోనే పుట్టిన ఓ అబ్బాయి ఇటీవలే 'వీరచక్ర' బహుమతి అందుకున్నాడు. అతను ఎలాంటివాడంటారు?"

"తెనుగుజాతి నోములపంట అంటాను" అంటూ ఈ ప్రశ్న ఎందుకడిగాడో అర్థం కానట్లు చూశాడు.

"ఆ అబ్బాయి కథ చెబుతాను వినండి. 'వీరచక్ర' బహుమతిపొందిన వీరునికథ వినడం మీకుమాత్రం ఇష్టం ఉండదా?"

"అయ్యో, ఎంతమాట!, ఏదీ, చెప్పు నాయనా, సావధానంగావింటాను, ఎవరా అబ్బాయి, ఏవూరు......?" అదుర్దాగా అన్నాడు జానకిరామయ్య.

"ఆ అబ్బాయి దాదాపు ముప్ఫైయేండ్ల క్రిందట పుట్టాడు, ఈ ప్రాంతాల్లోనే."

"ఆ అబ్బాయి పేరు?"

క్షణమాలోచించి అన్నాడు యువకుడు "రాముడు...... తరువాత రామారావ్ అయ్యాడు."

"అతను అరుగురుబిడ్డల కుటుంబంలో, ఆఖరు వాడుగాపుట్టాడు...." యువకుడు మళ్లామొదలెట్టాడు. తండ్రి ఉన్నంతవరకూ అన్న వస్త్రాలకు లోటు లేకుండా జరిగినా, దురదృష్టవశాత్తు అతనుతల్లిగర్భంలో ఉండగనే, ఆయన పోవడం వల్ల కుటుంబం కష్టాల పాలయింది.

# మనిషికోరేది మనిషినే

"సంసారాన్ని పోషించేభారం వాళ్ల అమ్మ మీదపడింది. పైగా పిల్లలంతా ఇంకా రెక్కలు రానివాళ్లు. కాస్తోకూస్తో ఆస్తి ఉన్నా, వాళ తండ్రిపోవడంతో అది తగా ధాల్లోపడింది. మేనమామలున్నా, వాళ్లు, వీరికుటుంబ జోక్యం పట్టించుకోలేదు.....

మొగదక్షత లేక సతమతమవుతోన్న ఆమెకు ఇంటిపట్టునడండి పిల్లలకు విద్యా బుద్ధులూ, వాళ్ల యోగక్షేమాలు కనుక్కోవడానికి వీల్లేకపోయింది. దాంతో ఆ కుర్రవాడి అన్నలకుకొద్దిపాటి చదువు మాత్రం అబ్బి, గుమాస్తాలు గాను, మేస్త్రీలు గాను చేరిపొయ్యారు. వాళ్లుగూడా సంసారపరులయి, వాళ్ల కుటుంబాలనే వారు పోషించుకోలేని స్థితిలో, కడసారి వానిక్షేమం కాని, వాళ్ల అమ్మక్షేమం గాని విచారించలేక పొయ్యారు...."

"ఇదంతా ఎందుకు చెప్తుతున్నావబ్బాయి" అర్థంకాక అన్నాడు జానకిరామయ్య.

"అదుగో, మీరు జోహారువేసే యీ వీరునికథవినడానికి మీరే ఇష్టపడటం లేదు.. కేవలం ఆతనిజీవితంలోని అద్భుతమైన సంగతులు వినడానికే మీకు ఇష్టంలా ఉంది. మరి అది మానవ మనస్తత్వంకాబోలు...."

"అయితేవింటాను, చెప్పునాయనా, ఏమీ అనుకోకు...." నొచ్చుకుంటున్నట్లన్నాడు.

"రాముడు కడసారివాడు కాబట్టి, తల్లి గూడా ఏమీ అనకుండా, ఉన్నంతలో, గారాబంగా పెంచింది. ఎలాంటితప్పు చేసినా శిక్షించడానికి ఆమెకు మనసొప్పేది కాదు. దాంతో ఆ కుర్రవాడికి క్రమశిక్షణ బొత్తిగా లేకపోయింది.

అవూరికి రెండుమైళ్లదూరంలో ఉండే బడికి తోటిపిల్లలతోవెళ్లి చదువుకోమని పంపిస్తే, బడిమానేసి, త్రోవలో'ఉయ్యాల' కాలవలో మధ్యాహ్నం వరకు ఈతగొట్టి, గొట్టికాయలు కోతికొమ్మంచులూ ఆడి, తనకూడా తెచ్చుకున్న అన్నం తినేసి, సాయంకాలానికి ఇల్లు చేరేవాడు.

ఆ అబ్బాయి పుట్టినప్పటినుంచి చాలా పుష్టిగా ఉండేవాడు. ఆహార విహారాల్లో క్రమపద్ధతిలేక, 'బేకారుగా' గా తిరుగుతున్నా, భగవంతుడిచ్చిన దేహబలం వల్ల ఎప్పుడూ జ్వరమని చిందీ ఎరుగడు. అంచేత వాళ్ల అమ్మకూడా ఈ కుర్రాణ్ణి గుర్తి ఎక్కువ పట్టించుకోవలసిన అవసరం లేకపోయింది.

"అయితే, తోటికుర్రాళ్లతో గిల్లికజ్జాయాలు పెట్టుకుని, వాళ్ళనందరినీ చావగొట్టేవాడు. పిల్లల తగాదా తీర్చేటప్పటికి కుర్రాడితల్లికి తలనొప్పి అయ్యేది. ఒకనాడు మునసబుగారి అబ్బాయినికూడా కొట్టడం వల్ల, వాళ్లు ఇంటిమీదికి దండెత్తివచ్చి, వూరింటిని చాలవరకుశిథిలంచేయడం వరకు వెళ్లింది. కుర్రాడితల్లి ఎన్నోక్షమాపణలు చెప్పుకోవలసి వచ్చింది.

పైగా ఆకుర్రాడికి ఆకలి'గానుగచక్రంలా' అయ్యేది. ఇంట్లో తిండిచాలక,వూరుమీద పడి చేలల్లో దోసకాయలూ, వేరుశనక్కాయలూ అవి తినేవాడు. ఇలాంటి పనులు వూరివాళ్లకు సహింపరానివయి పోయాయి. కుర్రాణ్ణి కట్టుదిట్టంతో పెట్టకపోతే, వాళ్లనువూరినుంచి వెళ్లగొట్టవలసి వస్తుందని వూరిపెద్దలు హెచ్చరించారు.

ఈ పరిస్థితుల్లో అన్నలు జోక్యం కలిగించుకుని, రాముడికి, పల్లెటూళ్లో, ఉంటే విద్యాబుద్ధులు అబ్బవనీ, తమపిల్ల అవినేర్పించే స్తోమతులేదనీ పైగా, తమ భార్యలతో పేచీవస్తుందనీ చెప్పి, ఆ అబ్బాయిని 'అప్పాపురం' దత్తు పంపించాలని నిశ్చయించారు. అప్పాపురం వాళ్లకు బోలెడు ఆస్తిపాస్తులున్నా బిడ్డలులేక చాలా ఇదయి



ఎక్కడ దూరపుబంధువు. పైగా కుర్రగాడు మంచి చలాకీ అయినవాడు, ఆరోగ్యవంతుడూ అని వాళ్లు దత్తు తీసుకోవడానికి మనసు పడ్డారు.

నలుగురూ చుట్టుముట్టి, వత్తిడిచేసి కుర్రాణ్ణి 'అప్పాపురం' పంపించారు. కుర్రవాడు దిగులు పడతాడని వాళ్లమ్మ నాలుగు రోజులుఉండి, ధైర్యంచెప్పి, బాగా చదువుకోమని బుద్ధులుగరిపి స్వగ్రామం వెళ్లింది.

కాని, రాముడికి అక్కడఉండటం ఏమాత్రం మనస్కరించలేదు. అంతా క్రొత్తవాళ్ళు, క్రొత్త బాంధవ్యాలు! బాగా కలవారు కాబట్టి ఏవేవో 'పద్ధతులూ,' 'నడవడి' అంటూఉండేవాళ్లు! తను అక్కడ కాలుపెట్టాడోలేదో ఎవరో ప్రైవేటు మేష్టార్ని పెట్టారు. ఆయన ఎప్పుడూ పాఠం, పాఠం అంటూ నసపెట్టేవాడు. కూర్చోనివ్వడు, నుంచోనివ్వడు.

అక్కడ, చెమటలుపట్టేలా ఆడుకుని హాయిగా, స్వేచ్ఛగా ఈతకొట్టడానికి ఒక కాలవకూడా లేదు. ఒకనిముషం కనబడకపోతే ఎక్కడకు వెళ్లావని ఒకటేగొడవ. తను కావాలన్నది తినడానికి వీల్లేదు., కోరుకున్నది తీసుకోవడానికి వీల్లేదు. అదివద్దు, జబ్బుచేస్తుంది, ఇదితప్పు, చేయకూడదు, అంటూ ఒకటే శాసనాలు, కట్టడీలు. రాముడిజీవితం, రోజులు జరిగేకొద్దీ దుర్భరం అయిపోయింది.

రాత్రిపూట పడుకున్నా, ఏవరకూ నిద్ర పట్టేదికాదు. పైన చుక్కల్ని చూస్తూ ఉండిపొయ్యేడు. తను స్వేచ్ఛగా, నిరాటంకంగా తిరుగుతూ, ఆడే, పాడే తన స్వగ్రామం, తన జన్మస్థలం మీదకు బుద్ధి మళ్లింది. తను రోజూ మధ్యాహ్నంవరకు ఈతకొట్టే 'ఉయ్యాలకాలువ' తన్ను పిలిచినట్లయింది. అనంతమైన ఆకాశంలో ఎక్కడో ఎత్తుగా హాయిగా ఎగిరే గరుడపక్షి గుర్తుకువచ్చి బెజారయి పొయ్యాడు. మళ్లా తన జన్మస్థలం చేరుకోవాలని అంగలార్చాడు.

ఎట్లా వూరికివెళ్లడం? దాదాపు నలభై మైళ్లునడవాలి. చేతిలో చిల్లిగవ్వలేదు. సంచీతీసుకుని పోతే, ఎక్కడకువెడుతావని అడుగుతారు. అంచేత ఒక ఉపాయం ఆలోచించాడు. తనకున్న రెండుజతల చొక్కాలాగులను ఒకదానిపై ఒకటి వేసుకుని ఎవ్వరి కంటపడకుండా పూరూనాళ్లూ దాటి మర్నాటిరాత్రికి తన వూరు చేరుకున్నాడు.

ఇలాంటి పనిచేసినందుకు వాడితల్లి చింతగానో వాపోయింది. అన్నలు కొందరు వచ్చి చచ్చేటట్లు కొట్టారుకూడా. గ్రామస్థులందరూ చివాట్లు వేశారు. అయినా ఆ కుర్రవాడు మళ్లా దత్తు వెళ్లేదిలేదని మొండి వేసుక్కూర్చున్నాడు. అయితే "మీ ఇద్దరూ ఎక్కడయినా చావండి మాకేం?" అంటూ పెద్దవాళ్లు తమ్ముణ్ణి, తల్లిని వదిలేసి చక్కా వెళ్లిపొయ్యారు.

ఇలాంటిపరిస్థితుల్లో రాముడి తల్లికి అవూళ్లో ఉండటం కష్టమయిపోయింది. ఇల్లు జరుగుబాటు తక్కువయింది. బస్తీకి వెళ్లి ఎక్కడయినా పనిచేసుకుని కుర్రవాడికి అక్షరంముక్క వచ్చేట్టు చూచుకోవాలనుకుంది.

బస్తీకివెళ్లి పనికోసం ప్రయత్నించింది. కాని పరువుగా బ్రతకడానికి తగినపని ఏదీ కనుపించదు. చివరకు ఒక పొగాకు వ్యాపారస్తుని ఇంట్లో వంటలక్కగా చేరింది.

యజమాని ఇంట్లో ఉదయాస్తమానాలు పనిలో మునిగిపోయి, రాముడి తల్లి బిడ్డవిషయం పట్టించుకోవడమే దుస్తరమయిపోయింది. ఇక రాముడు బజారుమనిషి అయిపొయ్యాడు. రోడ్లన్నీ బలాదూరుగా తిరుగుతూ రాత్రి ఎప్పటికో 'గూటికి' చేరుకునేవాడు.

పొగాకు వ్యాపారస్తుని కంపెనీలో కొంతకాలం పనిచేయక పోలేదు. ఏవో నెలకు నాలుగురాళ్లు సంపాదించగలిగాడు కూడా. కాని ఆ వ్యాపారంలోని అవినీతికి వాడు తట్టుకోలేకపొయ్యాడు. పైన నుంచిపొగాకు లోపల గుల్లసరుకూ ఉంచి, 'చెక్కులు' కట్టమనేవాళ్లు? అడ్డమైనవాళ్లకూ, కాఫీ ఉప్మాలు తీసుకరావడానికి హొటళ్లనుంచి కంపెనీకి, కాళ్లు అరిగిపొయ్యేలా తిరిగాడు. చివరకూ కంపెనీకి వస్తూన్న'ఘరానా' మనుషుల అవసరాలకు, కంపెనీలోని ఆడకూలీలవద్దకు ఏవోసందేశాలు తీసుక వెళ్లమని నిర్బంధించడంతో, యజమానిమీద ఎదురుతిరగడం, ఆయన వీపువాచేలా కొట్టి పంపడం జరిగింది. చివరకు కాఫీ హొటల్లో పనికికూడా చుక్కెదురయి, చీవాట్లతో బయటపడ్డాడు..." అంటూ మిలిటరీ యువకుడు తనకథనం కాస్త ఆపి, ఆ శ్రోత వేపు చూశాడు.

"పాపం, ఆ అబ్బాయి ఏంచేస్తాడు? న్యాయానికి కూడులేదు. సంఘానికి పనివాళ్లను ఎలా వినియోగించుకోవాలో తెలియదు, పాడులోకం, ఇది...." అంటూ జానకిరామయ్య సంఘంపై నోరు చేసు

(40 వ పేజీ చూడండి)

## పాఠకులకు మనవి

కొంతకాలంగా భారతదేశంలోని వార్తాపత్రికలు అతి క్లిష్టమయిన పరిస్థితిని ఎదుర్కొంటున్నాయి. వార్తాపత్రికలకు కావలసినంత న్యూస్‌ప్రింట్ దొరకకపోవటమే ఈ పరిస్థితికి ముఖ్యకారణం. ఇటీవల పాకిస్తాన్ జరిపిన దురాక్రమణ ఈ క్లిష్టమయిన పరిస్థితిని మరింత తీవ్రం చేసింది.

అందుచేతనే 'ఇండియన్ ఎండ్ ఈస్టర్న్ న్యూస్‌పేపర్ సొసయిటీ' కార్యవర్గం న్యూస్‌ప్రింటు వాడకంలో కొన్ని మార్పులు తీసుకురావాలని నిశ్చయించింది. పేజీల సంఖ్య తగ్గించడంకాని, ముద్రించే ప్రతుల సంఖ్య తగ్గించటంగాని, లేదా రెండూ తగ్గించడం కాని అవసరమేమోనని కార్యవర్గం సూచించింది.

అయినప్పటికి, న్యూస్‌ప్రింట్ మాత్రమే కాక 'వైట్ ప్రింటింగ్' కాగితం కూడా వాడితేకాని పత్రికల ప్రచురణ సాగటం దుస్తరం. వైట్ ప్రింటింగ్ కాగితం వెల న్యూస్‌ప్రింట్ వెలకన్న సుమారు రెండు రెట్లు ఎక్కువవుతుంది. కాబట్టి పత్రికల ధరలు ఎక్కువచేయుటం అత్యవసరం.

1966 జనవరి 1 వ తేదినుంచి మా పత్రికల ధరలు ఈ క్రిందివిధంగా ఉంటాయి.

ఆంధ్రపత్రిక దినపత్రిక 10 పైసలు

ఆంధ్రపత్రిక ఆదివారం సంచిక 15 పైసలు

**14—1—66 సంచిక నుంచి...**

ఆంధ్ర సచిత్ర వారపత్రిక 35 పైసలు

ఎప్పటివలె ఆంధ్రపత్రిక, ఆంధ్ర సచిత్ర వారపత్రిక అభిమానులు మాతో సహకరించగలరని ఆశిస్తున్నాము.

మేనేజర్,
ఆంధ్రపత్రిక.




భూమి సూర్యుడి చుట్టూ తిరుగుతూ వున్నట్లైతే నక్షత్రాలు,అవి వాటిల్లో కదిలి నట్టు కనబడవేమీ? అన్న చిరకాలప్రశ్న న్యూటను తరవాతివరకూ అలాగేనిల్చిపోయింది. రైల్లో మనము ప్రయాణము చేస్తున్నప్పుడు దూరంగా ఉన్నచెట్లు కదలినట్లు కనబడవు. దూరం నుంచి కన్ను దగ్గరకు చూస్తూ వచ్చినప్పుడు చెట్లవేగము క్రమంగా ఎక్కువవుతుంది, దగ్గరవున్నచెట్లు వాటికంటే దూరంగా వున్నచెట్లను దాటుకుపోతూన్నట్లు కనబడతాయి. భూమి సూర్యుడి చుట్టూ తిరుగుతోంది అంటున్నారు కదా, మరి నక్షత్రాలు—మనకు దగ్గరగా ఉండేవి-దూరంగా ఉండేవాటిని దాటుకు పోవడములేదు సరిగదా, సమీపిస్తూన్నట్లైనా కనబడవేమీ? ఈ ప్రశ్నకు పికార్డువంటి వైజ్ఞానికులు "నక్షత్రాలు అపరిమిత దూరంలో ఉండడము వల్ల"నని జవాబు చెప్పేరు. అయితే అంత మాత్రంతో వూరుకోడమేనా? "మంచిమంచి సాధనాలు—టెలిస్కోపులు అందుబాటులో వుండీ కూడా నక్షత్రాల సాపేక్ష చలనము (Relative motion) కనిపెట్టలేమా?" అని జేమ్స్‌బ్రాడ్లీ యత్నించాడు. ధ్రువ నక్షత్రము రాత్రల్లా స్థిరంగా వుంటుంది ఆకాశంలో. దానికీ నక్షత్రాలు ఒక్కొక్క దానికీ వున్న దూరాలు—మనకు గోచరించేవి—జూన్‌లోనూ డిసెంబరులోనూ కొలిస్తే ఆ దూరాలలో స్వల్ప తేడా అయినా కనబడాలికదా అని ఆలోచించాడు బ్రాడ్లీ. అలాటి అవలోకనాలు చేశాడు. అయితే, అతడు పట్టవెంచిన భేదము ఆ సరళపద్ధతికి దొరికి పోయేటంత పెద్దది కాదు. కాని దీనికోసము వెతుకుతుంటే ఇంతకన్న ఆశ్చర్యకరమైనదీ ఇంకొక ఫలము దొరికింది.

దూర భూరేఖకు చేరువగా ఉండే నక్షత్రాల వెల్తురు గాలి లోంచి చాలాదూరం చొప్పుకు రావడంలో వక్రీభవము (Refraction) పొందుతుందని బ్రాడ్లీ నడునెత్తిన కనబడే నక్షత్రాన్ని పట్టి డిసెంబరు మాసారంభంలో దానికీ ధ్రువనక్షత్రానికీ గల కోణమును కొలిచాడు. ఆ తరవాత ఆరునెలలు ఆగవలసి ఉండెను. [భూమి తన కక్ష్య (Orbit) యొక్క రెండో కొనదగ్గరకు వస్తుంది అప్పటికి]. బ్రాడ్లీ ఒక వారం రోజుల తరవాత చూశాడు. ఆ నక్షత్రము కొంచెం జరిగినట్టు కనబడింది. వారం వారం చూస్తూ పోయాడు, జరుగుడు స్వల్పమే అయినా వుండడము మట్టుకు ఉంది. అది క్రమంగా దక్షిణం వైపు జరిగింది, మార్చినుంచి సెప్టెంబరు వరకూ ఉత్తరానికి జరిగి డిసెంబరుకి యథాస్థానము చేరుకుంది. ఆ నక్షత్రము మొత్తమ్మీద ఒక తిరుగుడు—లేదా ఒక 'ఊపు' పూర్తిచేసింది ఒక సంవత్సరంలో. ఇతర నక్షత్రాలూ ఇంతే చేశాయి. ఒక గుంపులోని వర్తులాలలో తిరిగే యా, కొన్ని తిన్నని గీతలమీద ఊగులాడేయి, తక్కినవి చిన్న దీర్ఘవృత్తాలలో (Ellipses) లో తిరిగేయి. నక్షత్రాలగుంపులలో వున్న ఒక్కొక్క నక్షత్రమూ తక్కినవాటిని బట్టి జరుగుతుందేమోనని చూస్తే, అన్నీ ఒకేలాటి దీర్ఘవృత్తాలలో ఏడాది కొకమారు తిరుగుతున్నాయి.

అన్నిటికీ వున్న చలనము కనక ఇది మనము ఇంతవరకూ ఎరగని కారణము వల్ల వచ్చినదీ, భూమి సూర్యుడిచుట్టూ తిరిగి వచ్చే సంవత్సరకాలానికి సంబంధించినదీ అయి వుండాలి. చాలానాళ్లు ఆలోచించాడు బ్రాడ్లీ. ఒకనాడు థేమ్సునది మీద ఒకవైపునించి విసురుతున్న గాలి ఆతడు కూర్చున్న పడవ కదలగానే, పక్కగా మరొకవైపునుంచి విసురుతూన్నట్లు కనబడడము గుర్తించాడు. అలాగే, నక్షత్రాన్ని చూస్తున్నప్పుడు తాను ఇందాకటి బోటువలె కదిలి పోతూన్న భూమి మీదనుంచి చూస్తున్నాడు గదా? వెల్తురు నక్షత్రం నుంచి బయలుదేరి టెలిస్కోపు ముఖాన్నగల వస్తు కటకమన్న భూతద్దములో నడిమి బిందువు వద్ద ప్రవేశించిందనుకుందాము. ఆ వెల్తురు టెలిస్కోపులో ప్రయాణించి 2అన్న అక్షి కటకము (Eye piece) కడకు చేరేసరికి భూమి, దిగువ బాణము సూచించే దిక్కులో 1నుండి 2కు కదలి వెళ్లినది. పటములో చక్కగా తెలియడానికి గాను భూమి ఎక్కువదూరము ప్రయాణించినట్లు చూపినాను. వాస్తవానికి ఆ కొద్దికాలములో భూమి జరిగే దూరము వస్తు కటక కేంద్రమువద్ద పొడిచే 'క' అనే కోణము 20 సెకనులు, ఒక డిగ్రీలో 180వ భాగము. వెల్తురు టెలిస్కోపు పొడవంతా ప్రయాణించే కాలంలో టెలిస్కోపు భూమితో 'కొంచెము' దూరము ప్రయాణించింది. తెలిసిన భూవేగమును బట్టి వెల్తురువేగము లెక్క గట్టితే సెకనుకు 190,000 మైళ్లుగా తేలినది. ఫరవాలేదు, సుమారుగానే వచ్చింది.

రోమరు గురుని ఉపగ్రహాల గ్రహణాల అంతరకాలాల తేడాను బట్టి వెల్తురు వేగాన్ని లెక్క గట్టినప్పుడు "ఆ ఉపగ్రహాలు గురుడి చుట్టూ తిరిగే వేగము మారుతూండ లేదని నిర్ధారణ ఏమిటి?" అని ఆక్షేపించిన జ్యోతిశ్శాస్త్రజ్ఞులు బ్రాడ్లీ కనుగొన్న విషయాన్ని ప్రహరముతో ఆదరించారు.

బ్రాడ్లే అంతటితో కొలతలు ఆపలేదు. అనుకోనిది ఇంకేది దొరుకునో! కొలతలు తియ్యగా తియ్యగా వాటిలో కొత్తచిక్కు వచ్చిపడింది. ఇందాకటి సంవత్సరపు తిరుగుడుకి తోడు కొన్నియేండ్లకొకమారు ఆవృత మౌతోందా అని అనుమానించదగ్గ అదనపు తిరుగుడు కనబడింది నక్షత్రాలకు. ఈ

రెండు వేర్వేరు తిరుగుళ్లనూ స్ఫుటముగా విడదియ్యాలని బ్రాడ్లీ పందొమ్మిదేళ్లు తీశాడు నక్షత్రాల కొలతలు. అప్పటికి ఈ రెండో తిరుగుడు పునరావృతికి వచ్చింది. 'పందొమ్మిదేళ్లు' అనగానే చంద్రుడి మార్పులు అన్నీ పునరావృతమయ్యే కాలము గదా అని తెలిసి వచ్చింది బ్రాడ్లేకి. చంద్రుడివల్ల ప్రవేశించిన మార్పు అన్నమాట ఈ రెండో తిరుగుడు. బొంగరము నిటారుగా తిరిగితిరిగి బుర్ర ఆడిస్తూ తిరుగుతుందని మనము ఎరుగుదుము. బొంగరములాగే





తనచుట్టూ తాను తిరిగే భూమి 26,000 ఏండ్లకొకమారు చొప్పున, బొంగరము లాగే బుర్ర తిప్పుకుంటూ తిరుగుతుంది. ఇలా తిరుగుతూ, చంద్రుడు తన ఉబ్బినబొజ్జను లాగే ఆకర్షణవల్ల తల ఆడిస్తుందనీ, పైన రెండో తిరుగుడు చంద్రుడి ఆకర్షణవల్లనే 19 ఏళ్లకొకమారు తిరిగి తిరిగి వస్తుంటుందనీ బ్రాడ్లీ కనుక్కున్నాడు. న్యూటన్ తరవాత వచ్చి ఇంతగొప్ప సత్యాలు కనిపెట్టిన బ్రాడ్లే ప్రపంచ విఖ్యాతిగల కొద్దిమందిలో చోటు సంపాదించుకున్నాడు. ●

సీరియల్

# కరుణ






కొండముది శ్రీరామచంద్రమూర్తి

జమదగ్ని భార్య శారదాంబ తన కుమారుడు ప్రసన్నతోబాటు విశ్వనాథంగారమ్మాయి కరుణను కూడా పెంచి పెద్దచేస్తుంది. పెద్దకుమారుడైన మన్మథుని జమదగ్ని తమ్ముడు చలపతి పెంచుకుంటాడు. [illegible] పరీక్షలూ, చదువులూ కంటే, ఆటపాటలే మన్మథను ఎక్కువగా ఆకర్షిస్తాయి. ప్రసన్న, మన్మథ, కరుణలు బి. ఏ. పరీక్ష ప్యాసవుతారు. ప్రసన్న తనను ప్రేమిస్తున్నాడని తెలిసి ఉప్పొంగిపోతుంది కరుణ. మన్మథకు తన జీవిత గాథ వినిపిస్తాడు చలపతి. చలపతికి మరింత సన్నిహితుడౌతాడు మన్మథ. మన్మథతో కరుణ పెళ్లి విషయం తనే ప్రస్తావిస్తానని మన్మథకు మాట ఇస్తాడు చలపతి. కరుణను ప్రసన్నకు చేసుకోమని జమదగ్ని కోరినాగాని, కరుణ ప్రసన్నలు ప్రేమించుకున్నందువల్ల ప్రసన్నకే కరుణ భార్య కావాలని పట్టుపట్టాడు విశ్వనాథం.

## 11

[illegible], అంత రాత్రివేళ ఆ పలితో [illegible] కన్నీళ్లతో తడుపుకొని, కాసిని [illegible] పుచుకొని, పక్కొ మంచం[illegible] వాల్చుతూ, "అమ్మలూ! వెళ్లిన పని సానుకూలమైంది—రాలేదు." అన్నాడు విశ్వనాథం.

కరుణ అయోమయంగా తండ్రివేపు చూసింది. "నీకు పెళ్లి నిశ్చయమైంది. కాని వాళ్ళు మన్మథకు చేసుకుంటామన్నారు."

"మన్మథకా ?" ఆ ప్రశ్నలో ఉన్న కాతరభావాన్ని గమనించిన విశ్వనాథం, బూరుగ దూది దిండు తలక్రిందకు లాక్కుంటూ, పెదిమలపైకి నవ్వు తెచ్చుకొంటూ అన్నాడు. "ఏం ?—కూడదా ?" కరుణ తనను తాను నిగ్రహించుకొంది. "మీరు అవుననివచ్చారా ?" గంభీరంగా అడిగింది.

"అన్నానే అనుకో !"

"అయితే అది కూడినదే అవుతుంది."

కరుణ గిరుక్కున తిరిగి లోపలికి వెళ్లబోయింది. గిరుక్కున వెనుకకు తిరగడంతో [illegible] విపరీతార్థం చేసింది. సిగలో వాడిన పూవు, ఎండిపోయిన పెదిమలు, కంటి కొసలనుండి క్రిందకు కారిన కాటుక, మొహానికి పట్టిన చెమట, ఆమె భావాన్ని చెప్పకనే చెప్పాయి.

విశ్వనాథం లేచి కూచుంటూ, "నీ మనసుకు వ్యతిరేకంగా నేను చేస్తానని అనుకున్నావా తల్లీ!" అని అడిగాడు. గుమ్మందాకా దాకా వెళ్లిన కరుణ అక్కడ ఆగి, తండ్రి వైపు చూస్తూ అన్నది. "మీరట్లా చెయ్యరని నాకు నమ్మకం. ఒకవేళ చేస్తే దాని వెనకాతల ఏదో విశేషమే ఉంటుంది."

విశ్వనాథం తనలో తాను గొణుక్కున్నాడు "నీలాంటి కూతురుండడం నా అదృష్టం."

"ఆ అదృష్టం మీది కాదు, నాది. నన్నర్థం చేసుకోగల తండ్రి ఉండడం...."

కరుణను వెనకకు పిల్చి, అక్కున చేర్చుకుంటూ, అన్ని విషయాలూ వివరించి చెప్పాడు. "నేను నిన్ను ప్రసన్నకు తప్ప ఇయ్యనన్నాను. ఎందుకని ఇట్లా ఈ నిర్ణయానికి వచ్చానో కూడా వాళ్లకు తెలియజెప్పాను. ఇంతకన్నా ఏం చెయ్యగలనమ్మా ?"

కరుణకు తండ్రి చేసినదానిలో తప్పు కనిపించలేదు. వ్యవహారం అంతవరకు వచ్చింది గనుక, తనూ, తన నిర్ణయాన్ని ఆయనకు ముందే చెప్పడం శ్రేయస్కర మనిపించింది. "వాళ్ళు మిమ్మల్ని బలవంత పెడతారేమో?"

"నేనంత పిరికిగుండెను కాదమ్మా!"

"మీరు మాట ఇవ్వలేదన్నారు గనుక చెబుతున్నాను. మీతో కాక మరెవరితో నేను చెప్పుకోగలను ?—అనుకొన్న సంబంధం కాక పోతే, అసలి పెళ్లి ప్రసక్తే ఇప్పుడు వద్దు నాన్నగారూ !"

"అట్లాగేనమ్మా !"

ఆ రాత్రి వాళ్లిద్దరినీ నిద్రాదేవి అంతంత గానే లాలించింది. కరుణ గదిలో లైటు అలా వెలుగుతూనే ఉంది. విశ్వనాథం ఎప్పుడో తెల్లవారుజామున నిద్రపోగలిగాడు,

[illegible] అట్లా ఒంటరిగా, తన గదిలో తాను అనుమానాల మధ్య, ఆలోచనల మధ్య పుస్తకాలతో కుస్తీ పడుతుండగా, నిరాశతో నిస్పృహతో ఇంట్లోంచి బయటికి వచ్చేసిన ప్రసన్న, గమ్యమంటూ లేకుండా రోడ్లవెంట తిరుగుతున్నాడు. పార్కులో కూచున్నంతసేపు కూచోనిచ్చి, "గేటు తాళమేస్తుండా, ఇంకెళ్లిపో బాబూ !" అన్నాడు గేట్‌మెన్. కాల్వప్రక్కన కూచుంటే, "ఏంటి?— ఆత్మహత్య కోసం వచ్చావా?— వెళ్లు వెళ్లు" అంటూ తరిమేశాడు పోలీసు జవాను. [illegible]నిలో ఉన్న ఆందోళన అతన్ని కూర్చున్న చోట కూచోనీకుండా, నుంచున్న చోట నుంచోనీకుండా చేస్తున్నది. చిన్నప్పటినుంచి తను ఎంతో ప్రేమతో నిర్మించుకున్న ఆశల పూలదండ పుటుక్కున తెగిపోయింది. దీనికి ఒకరిని నిందించవలసిన పనిలేదనిపించింది. తనిప్పుడు నోరుతెరచి, మనసులోని మాటను ఒకరితో చెబితే, అన్న మంచి చూసి ఓర్చుకోలేని తమ్ముడి క్రింద పరిగణింపబడతాడు. మనస్సులోని బాధ ఒకరితో పంచుకోకపోతే, ఆ అగ్నిని గుండెల్లో దాచుకోలేడు. అతనికి ఆలోచించగా ఆలోచించగా అనిపించింది. తనిప్పుడు గరళకంఠుడు కావాలి. అంతకన్నా మార్గంలేదు. ఒకరి అదృష్టాన్ని మరొకరెటూ అపహరించలేరు. అట్లాగే, ఒకరి దురదృష్టానికి మరొకరు కర్తలూ కారు. క్షణకాలం తనలోని అజ్ఞానం కారణంగా తన కన్న తలిదండ్రులమీదా, బాబాయిమీదా, చెల్లెలుమీదా, అందరిమీదా కోపం వచ్చింది. అది తను ఇంకా పెరగవలసిన దశనే సూచిస్తున్నది. తను కోపాన్ని జయించాలి. బాధను ఓర్చుకోవాలి. ఇతరుల ఆనందం చూసి, ఆనందపడడం తెలుసుకోవాలి. అప్పుడే తన చదువుకు సార్థకత.

ప్రసన్న తన మనసుకూ, తన మమతకూ జరుగుతున్న సముద్రమథనంలో హాలాహలాన్నీ, అమృతాన్నీ కూడా అనుభవిస్తున్నా [illegible]

యంలో, ఇంటిదగ్గర, అవిరిగడ్డిపాకలో, కొంతరు క్రీనీడలో, నులకమంచంమీద కూచుని మన్మథ, చలపతి మాట్లాడు కొంటున్నారు.

"మీరు చేసినదానికి మీకెట్లా కృతజ్ఞత తెల్పగలను ?" అంటున్నాడు మన్మథ.

"అంతంత పెద్ద మాటలు వద్దు. నామీద నీకు గల ఈ అభిమానం జారి పోకుండా నిల్పుకో." చలపతి కంఠంలో వేదన ధ్వనిస్తోంది. "ఈ మునలి వయస్సులో తండ్రీ అని నన్ను లాలించేవాడూ, తలకొరివి పెట్టేవాడూ మాత్రమే నాకూ కావాలి."

వా రిద్దరకూ, తాము తమకు తెలియకనే సృష్టించిన ఆ సమస్య తమనే కాక ఆ ఇంట్లో మరో యిద్దరినీ కూడా కళవళపరుస్తున్నదని తెలీదు.

"ఇప్పుడేం చేయడమే ! గండకత్తెర వచ్చి పడింది." అన్నాడు జమదగ్ని.

"ప్రతి దానికీ అంత కంగారుపడతారు దేనికండీ ? అయితే మీమాట, కాకపోతే వాళ్ళమాట—అంతేకదా ?" శారదాంబ కళ్ళమీదకు వస్తున్న నిద్రను బలవంతాన ఆపు కుంటూ, "మన్మథకే చేసుకోదల్చుకున్నామని చెప్పండి. కాదు కూడ దంటారూ, మన్మథకు ఇంకో సంబంధం చూసి, ప్రసన్నకు చేసుకుందాం ఆ పిల్లను. ఏమైనా కరుణ మాత్రం ఈ ఇంటి కోడలు కాక తప్పదు."

"అది సరేనే ! ఇంతవరకూ వచ్చి, ఇప్పుడు వాడికి కాదని కరుణను ప్రసన్నకు చేస్తే, మన్మథ మనస్సు గాయపడదటే ?"

"వాడు మాత్రం అంత మూర్ఖుడా ఏమిటి ?—తనను కాదంటున్న గుదిబండను మెడకు తగుల్చుకోటానికి."

శారదాంబ నిద్రపోయింది. జమదగ్ని ఇంకా సరి అయిన జవాబు దొరకక కళవళ పడుతున్నాడు. మర్నాడు ప్రొద్దున్న ఎర్రబడ్డ కళ్ళతో, నిద్రలేమినీ, మనస్సులోని ఆరాటాన్నీ సూచిస్తున్న మొహంతో తన దగ్గరకు వచ్చిన ప్రసన్నను చూసి జాలిపడి అడిగాడు, తనకు దగ్గరగా కూచోపెట్టు కుంటూ.

"ఏమో, విశ్వనాథంగారు, కరుణను నీకి చ్చే ఇష్టానంటున్నారు. నీ అభిప్రాయం ఏమిటి ?—కరుణ అంటే నీకు ఇష్టమేనా ?"

ప్రసన్న ఆశ్చర్యంగా 'ఎమ్మతేసు' అన్నట్లు ఇంద్రధనస్సు చూశాడు. కొంచెంసేపు ఆలో చించుకొని, ఆ పైన జమదగ్నితో అన్నాడు.

"మన్మథ నన్ను అపార్థం చేసుకుంటాడు. ఇప్పటికే వాడంటే మీరంతా చిన్నచూపు చూస్తున్నారని వాడి అభిప్రాయం."

"పిచ్చి వెధవ ! ఆ అభిప్రాయాలకేం గానీ, నీ సంగతి చెప్పు."

"మీ రెట్లా చెబితే అట్లా చెయ్యడమే నా సంగతి !"

"ఈ సంగతి నాకు మొదట్నుంచీ తెలుసుగారా !— ఎప్పట్నుంచో చెప్పు కొదనవు. ఆ ధైర్యం మాకుంది."

ప్రసన్నతో మాట్లాడేసిం తర్వాత, జమదగ్ని, మెల్లగా నడుస్తూ చలపతి ఉన్న కుటీరం దగ్గరకు వచ్చాడు. అతని కాళ్ళు వణికాయి. తను చెయ్యదల్చుకున్న పనిని ఇతరులు కాదంటారేమో అన్న శంక పట్టుకుంది. అయినా తనకు తనే ధైర్యం చెప్పుకుని, గుమ్మం దగ్గరకు వచ్చి లోపలకు



తొంగిచూశాడు.— అంతవరకూ ఆయన ఎప్పుడూ చలపతి ఉంటున్న ఆ కుటీరంలోకి రాలేదు. ఆ అవసరం కలగలేదు. ఏదైనా మాట్లాడవలసి వస్తే, చలపతే, జమదగ్ని దగ్గరకు వచ్చేవాడు. చలపతి భార్య కాలా యిని, ఇంట్లో ఉన్న సమస్తమూ మూట గట్టుకు పోయింతర్వాత, ఈ వర్ణశాలావాసం చలపతి ప్రారంభించినప్పుడు మొట్టమొదటి రోజున మాత్రం ఆయన వచ్చి అన్నీ పరిశీలించి కావలసిన ఏర్పాట్లు చేసి వెళ్ళాడు. మళ్ళీ ఇదే రావడం.

లోపలికి తొంగిచూసిన జమదగ్నికి, నులక మంచంమీద పడుకొని, నిద్రపోతున్న మన్మథ కనిపించాడు. ఆ మొహం అమాయకంగాఉంది. గాలికి నుదుటిమీద పడి, ముంగురులు అల్లన అడుకొంటున్నాయి. ఉచ్ఛ్వాస నిశ్వాసాలకు ఎగసిపడుతున్న వెడదరొమ్ము పొరుపై

# కరుణ

నికి పోగన్నరిగా ఉన్నది.

చలపతి, పొలానికి రామయ్యను, బయలుదేరబోతున్నాడు.

జమదగ్నిని చూసి, కంగారుపడి, కాళ్ళ చెప్పులు విడిచి, 'రా అన్నయ్యా !' అంటూ చాప వేశాడు కూర్చోటానికి. "ఏదో పని మీద వచ్చినట్టున్నారు ?"

జమదగ్ని ఆ విషయం నేరుగా ప్రస్తావించటానికి బిడియపడ్డాడు. "అహ, ఏం లేదు. చేను మరమ్మతు తాలూకు డబ్బు నువ్వింకా నా దగ్గర్నుంచి తీసుకోలేదు."

"ఆఁ ! ఏంలేదు. కుంటలు తీసినవాళ్ళే, నాట్లకు్కూడా వచ్చారు. ఎకౌంటు అంతా కలిపి ఇయ్యవచ్చుకదా అని పస్తాయించాను." చలపతికి అనుమానంగాఉంది, అసలు విషయం ఇది కాదని. తను మాత్రం తొందరపడడం ఎందు కనుకున్నాడు.

"డబ్బు కావాలంటే, ముందుగా చెప్తే కానీ సమయానికి దొరకదుకదా !"

చలపతే ఇహ పిల్లి మెడలో గంట కడదామనుకొన్నాడు. "డబ్బుదేముంది కానీండి, ఉన్నంతలో దానికోసం ఎప్పుడూ మనం వెలితిపడలేదు, అంతకన్నా మరో ముఖ్యమైన పనిమీద మీరు వచ్చి ఉంటారు. ఏమిటది ?"

వాళ్ళిద్దరూ అట్లా మాట్లాడుకొంటుండగా, మెల్లగా మన్మథకు మెళకువ వచ్చింది. తన తండ్రులు ఇద్దరూ మాట్లాడుకోవడం విన్పించింది. లేద్దామా అనిపించింది. కానీ ఇంతలో జమదగ్ని కంఠం, "ఆఁ! ఏంలేదు —అబ్బాయి పెళ్లి విషయమయే మాట్లాడదామని వచ్చాను." అని విన్పించడంతో ఆసక్తి ఎక్కువై మళ్లీ నిద్ర నటించాడు.

"అందులో మాట్లాడే దేముంది ?— మన్మథకూ, కరుణకూ ముడిపెడదామనుకుంటిమి గదా !" చలపతి కొంచెం ఆశ్చర్యంతో అడిగాడు.

"అక్కడే వచ్చింది చిక్కు. విశ్వనాథమేమో, కరుణను ప్రసన్నకిచ్చి చెయ్యమంటున్నాడు."

చలపతికి ఆమాట వినగానే కోపం వచ్చింది "ఫలానా విధంగా చెయ్యమని ఆయనసడం ఏమిటి ?"

నంజాయిషీ చెప్పుకోవడం జమదగ్ని వంతయింది. "కరుణకు, ప్రసన్న అంటే ఎక్కువ ఇష్టమట." ఆ మాటలు వింటూ మన్మథ నిద్రపోలేకపోయాడు. మేల్కొని వాళ్లకు తన మొహము చూపించలేక పోతున్నాడు. మళ్లీ చలపతి మాటలే విన్పించాయి.

"మన్మథకు, కరుణ అంటే ఎక్కువ ష్టం."

చలపతి ఆవిధంగా మాట్లాడడం జమ గ్నిని ఇరకాటంలో పెట్టింది. ఎటు మాట్లా లేకపోయాడు. ఇంకా చలపతే బిగ్గరగా ంటున్నాడు. "ఆలోచించండి మీరు. ాడికి చదువులేకుండా చేశామా ?— ంట్లోనే వాడు దిష్టిపిడతలా పడిఉండాలా? మ్ముణ్ణి పై చదువులకు పంపిస్తూ, వాణ్ణి 'లంలో పనిచెయ్యమంటున్నామా ?— చివ కు పెళ్ళి విషయంలో కూడా, వాడికి ుందో పిల్లను ఖాయపర్చి, వాడికి కాదని, ుళ్ళీ ఆ పిల్లనే వాడి తమ్ముడికిచ్చి పెళ్ళి ద్దా మనుకుంటున్నామా ?—వాడి హృద యము క్షోభించదూ?— మనమంటే గౌర మూ, అభిమానమూ, ప్రేమా ఉండమంటే ట్లా ఉంటాయి ?"

జమదగ్ని వంచిన తల ఎత్తలేదు. తన ెద్దరికం అంతా కరిగిపోయినట్లనిపిం ంది. మెల్లగా నూతిలో గొంతుకలో అడి ాడు. "అయితే కరుణకు వేరే సంబంధం ూసుకోమని చెప్పేస్తాను."

మన్మథ ఆవేశంతో మంచంమీద లేచి ూచున్నాడు. "వద్దు. అట్లా వద్దు. కరు ణను తమ్ముడికే చేసుకుంటామని చెప్పండి" న్నాడు ఉద్విగ్నుడై.

"మన్మథా !" చలపతి బిగ్గరగా అన్నాడు. 'నువ్వేం మాట్లాడుతున్నావో నీకు తెలీడం ేదు. ఇది ఆవేశాలకు కాదు సమయం. ఆలోచనకు ! నువ్వాప్పుకోకు."

మన్మథ ! మంచం దిగి, లేచి మంచుని గొళ్ళు విర్చుకున్నాడు. అమాయికమైన అతని కళ్ళు బరువుగా వ్రాలిపోతున్నాయి. అతని కంఠం అతి సన్నంగా వినబడుతోంది. 'ఆలోచించుకునే చెబుతున్నాను. ఇంత కరిగింతర్వాత, కరుణ కుండ బద్దలు కొట్టి నట్లు, తను ప్రసన్ననే చేసుకుంటానని చెప్పింతర్వాత ఇంకా ఆ పిల్లనే చేసుకుంటా నంటే, నేనో తెలివితక్కువ వెధవనన్నా కావాలి, మూర్ఖుణ్ణన్నా కావాలి. అంచేత, నాన్నగారూ ! మీరు వెళ్ళి, విశ్వనాథం మాష్టా రితో, కరుణను చేసుకుంటామనీ, అదీ ప్రసన్నకేననీ చెప్పండి. వెళ్ళండి." అన్నాడు.

మన్మథ వ్యక్తిత్వం ఎంతగా పెరిగిందో స్పష్టంగా జమదగ్నికి తెలుస్తోంది. ఆ తండ్రి కళ్ళల్లో, కొడుకుపై జాలీ, మెప్పుదలా రెండు మిశ్రితమై కొట్టవచ్చినట్లు కన్పి స్తున్నాయి.

చలపతికి అంతా అయోమయంగా ఉంది,

"నీ త్యాగం నాకు నచ్చలేదు" అన్నాడు బాధగా.

మన్మథ నవ్వేశాడు. ఆ నవ్వులో జీవం లేదు. "మీారుచెప్పడానికి ఆలస్యంచేస్తే ఇహ నేనే చెప్పవలసి వస్తుంది. నా సంగతి మీాకు తెలుసుకదూ ?—నిర్ణయానికి రాను. వచ్చిం తర్వాత వెనక్కు తిరగను."

మన్మథ బయటకు వచ్చేసరికి అక్కడ కళ్యాణి నుంచుని కన్పించింది. "ఎందుకే ఇక్కడ నుంచున్నావ్ ?" కళ్యాణి కళ్ళల్లో మన్మథపై మెప్పుదల స్పష్టంగా కన్పి స్తోంది. తన ప్రశంస ఎట్లా చెప్పాలో తోచక, "బలేవాడి వన్నయ్యా నువ్వు." అన్నది.

"దొంగా ! అంతా విన్నావా ?"

కళ్యాణి తల ఊపింది. "అమ్మేమో ! కాఫీలకు మిమ్మల్ని రమ్మనమని పిల్చింది. వచ్చే సరికి మీా మాటలు విన్పించాయి. అందు కని ఇక్కడే ఉండిపోయాను."

"వింటే విన్నావుకాని, ఇదంతా ప్రసన్నకు చెప్పకు."

"వాడుకూడా నాతోపాటేవచ్చాడు. అంతా వినమా విన్నాడు."

"ఏడీ వాడు ?" మన్మథ ఆత్రుతగా ప్రశ్నించాడు.

"వాడి గదిలోకి వెళ్ళిపోయాడు !"

మన్మథ త్వరత్వరగా అడుగులు వేసు కుంటూ అక్కడికి వెళ్ళాడు. ప్రసన్న, గదిలో కుర్చీలో కూచుని, టేబిలుమీాద రెండు చేతులమధ్యా తల ఆనించి పడుకొని ఉన్నాడు.

"తమ్ముడూ !" అడుగుల చప్పుడు, మన్మథ స్వరం రెండూవినిపించి తల ఎత్తాడు ప్రసన్న. అతని చెంపలపైన ఉన్న తడి ఇంకా ఆరిపోలేదు. "అన్నయ్యా !" ఒక్క ఉదు టున లేచి, మన్మథ దగ్గరకు పరుగెత్తుకు వచ్చి, "ఇంతకాలం నిన్ను నేను మరోలా అర్థంచేసుకున్నాను. నన్ను క్షమించు" అంటూ రెండు చేతులూ పట్టుకున్నాడు. మన్మథ నిలువెల్లా కదిలిపోయాడు. తమ్ముణ్ణి హృదయానికి హత్తుకున్నాడు. కన్నీరు తుడుస్తూ "ఈ కన్నీళ్ళెమిట్రా?— ఆడ పిల్లలాగానూ" అంటూ ఎగతాళి చేసేడు, విషయం మారుస్తూ.

అన్న కౌగిట్లో ప్రసన్న గువ్వపిట్టలా ఒదిగిపోయాడు. "ఈ కన్నీరు నీ త్యాగాన్ని



"బాబ్బాబు!...ఈ చిన్న సహాయం చెయ్యి...[illegible] అయితే నేను [illegible]??"

## కరుణ

చూసిన ఆనందానికి చిహ్నం. నాకు ఇటువంటి అన్న ఒకడు ఉన్నాడన్న గర్వానికి చిహ్నం. ఇంతవరకూ నిన్ను తెలుసుకోలేక పోయిన నా అల్పత్వానికి చిహ్నం."

"నేనేం త్యాగం చెయ్యలేదు. అట్లా మాట్లాడి నన్ను చిన్నవాడ్ని చేయకు, అవమాన పర్చకు."

మన్మధ కౌగిట్లోంచి విడివడి, దూరంగా నిల్చుని, అన్నవేపే సూటిగా చూస్తూ, "ఇది త్యాగం కాదు ?— నువ్వు నా పెళ్ళికి ఒప్పుకోవు అనుకో !—ఏం జరుగుతుంది ?— అక్కడ కరుణకు మరో సంబంధం స్థిరపడుతుంది. ఇక్కడ నా హృదయం గాయపడుతుంది."

మన్మధ, తమ్ముడి అమాయకత్వం చూపి పెద్దగా నవ్వుతూ, "వోరి పిచ్చివాడా ! ఇందులో రహస్యం మరొకటుంది. కరుణ ఈ ఇంటికి పెద్ద కోడలుగా వస్తే, మనిద్దరము వేరవుతాం. నాకు భార్య కాదురా, తమ్ముడు కావాలి. తెలిసిందా ?" అన్నాడు ప్రసన్న వీపు తట్టుతూ.

ప్రసన్నకు మాటలు మిగలలేదు. హిమాలయమంత ఎత్తుకు పెరిగిన తన అన్న వైపు చూస్తూ, అట్టే నిల్చుండిపోయాడు. అతని కళ్ళల్లో నీళ్ళు లేవు. ఆ కళ్ళ నిండుగా కృతజ్ఞత పేరుకొని, ఆ హృదయం నిండుగా సౌందర్యం నిండి, మన్మధను అతని కొక దేవతామూర్తిగా భాసింపజేస్తున్నవి.

* * *

డబ్బు జబ్బు మనిషిని ఏమైనా చేయగలదు, మనిషిచేత ఎంత పనైనా చేయించగలదు. ధనీషణ, తృష్ణణ త్రయాల్లో మొదటిదాన్నిగా పేర్కొన్నారు మన మహర్షులు. అది కొండమీదికోతిని దిగుమతి చేస్తున్నది. పేదవాడికి అతని కల్లు త్రాగించి, వాడిచేత కోతిచేష్టలు చేయిస్తుంది. పేదవాడికీ—మధ్యతరగతివాడికీ మధ్య కనిపించని సముద్రాన్ని ఆ డబ్బే సృష్టిస్తున్నది. సృష్టిలోని వివిధ వైతన్యానికీ, వివిధ వినాశనానికి తనే కారణం అంటున్నది. పాపం!—వరేశం డబ్బు ఉన్నవాళ్ళూ తనవెయ్యి ఒకరి చెయ్యి కన్న పైనే వుంచుకున్నాడు. డబ్బుపోయి ఎన్ని బాధలు, అవమానాలు పడుతున్నాడో ఏమిటో!

వరేశం, జమదగ్ని చాలా తమాషాగా స్నేహితులయ్యారు. ఒకసారి రైల్లో ప్రయాణం చేస్తుండగా, జమదగ్నిజేబు నెవరో కత్తిరించేశారు. జేబులోవున్న డబ్బుతోపాటు కొన్న టిక్కెట్టుకూడా జేబు జారిపోయింది. జమదగ్నికి ముచ్చెమటలు పోశాయి; డబ్బు పోయినబాధ అంతరాంతరాళాలలో కలుక్కుమంటున్నా, టిక్కెట్టులేని ప్రయాణీకుల్లో తనూ ఒకడు కావాలసి వచ్చిందికదా అన్న అవమానం మొహంలో ప్రస్ఫుటమైంది. ఇంతలో టిక్కెట్టుకలెక్టరు, ఇంక ఏ పెట్టెలూ లేవన్నట్టుగా ఆ పెట్టెలోకే రావడమూ, వచ్చినవాడు పెట్టెలో ఇతరజనం ఎవరూ లేరన్నట్టుగా, జమదగ్నిని, "టిక్కెట్ ప్లీజ్!" అని అడగడమూ, ఆ క్షణంలో జమదగ్నికి కాళ్ళక్రింద భూమి కదలిపోతున్నట్లు, ఆకాశం తన నెత్తిమీదపడ్డట్లు అనిపించడం జరిగింది. జరిగింది ఎంతో వివరంగా, దయనీయంగా వివరించు కొన్నాడు. కత్తిరింపబడ్డ జేబు చూపించాడు. తను టిక్కెట్టులేకుండా ఎక్కిన ప్రయాణీకుల బాపతు కాదన్నాడు. అంతావిన్న ఆ టిక్కెట్ కలెక్టరు వెడద నవ్వొకటి నవ్వి,

"నిజమే! మీరు చాలా పెద్దమనుష్యులులాగానే కన్పిస్తున్నారు. మీరు చెప్పేదంతా నిజమే అనడానికి కత్తిరింపబడ్డ మీ జేబే సాక్ష్యముంది. అయితే నేనేం చేయగలను అని? ఒకటి, మీరు ఎక్సెస్ కడ్తే మీరు ప్రయాణం కొనసాగించేట్లు చేయగలను. రెండు. డబ్బులేకపోతే, వచ్చే స్టేషనులో దింపి వేయగలను. ఇవిరెండూ నేను చేయగలను. చెప్పండి, ఏం చేయమంటారు?" అన్నాడు.

జమదగ్నికి తలతీసేసి నట్లయింది. అతని మాటతో ప్రాణంలేకుండా పోయింది. "మీ ఇష్టం—" అన్నాడు ఎంతో అయిష్టంగా. దిగవలసి వచ్చినచోట, మరొక్కసారి అడిగి చూశాడు, మరో మార్గం ఏమీ లేదా అని. టిక్కెట్టు కలెక్టరు అడ్డంగా తలవూపి, "ఇక్కడ బండి ఎక్కువసేపు ఆగదు. మీరు దయచేసి తొందరగా దిగాలి." అన్నాడు పరుషంగా. విధిలేక, చేతనున్నఒక్కసంచీ తీసుకుని, దిగడానికి జమదగ్ని ఉద్యుక్తుడయ్యాడు. నడవలేక అడుగు పోనట్లుగా, ముందుకు వెళ్తున్నాడు.

(సశేషం)

# వారఫలం

## 7-1-1966 శుక్రవారం మొదలు 13-1-1966 గురువారం వరకు.

**మేషం :** ఈవారం మీరు జరిపే వ్యవహారాల వలన వెంటనే విశేషమైన ప్రయోజనం లేకపోయినా, ముమ్ముందు తప్పకుండా తగినఉపయోగం ఉంటుంది. రావలసిన డబ్బు సమయానికి అందకపోవడం వలన కొన్ని కార్యక్రమాలను వాయిదా వేయవలసి వస్తుంది. ఉద్యోగంలో మీ పరిస్థితి యిదివరకటి కంటే బాగా ఉంటుంది. రాజకీయ వ్యవహారాల్లో నూతనోద్యమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. శుభకార్యాల విషయంలో మీ ఆలోచనలకు తగిన సంఘటనలు జరుగుతాయి. కుటుంబ వ్యవహారాల్లో అధికవ్యయం జరుగుతుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. సాంఘిక కార్యక్రమాల్లో ప్రాముఖ్యత పెరుగుతుంది. పుణ్య కార్యాలు చేస్తారు.

**వృషభం :** గతవారం కంటేయీ వారం అనుకూలంగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో యిదివరకు యేవో కారణాల వలన ఆగిపోయిన వ్యవహారాలను యిప్పుడు లాభదాయకంగా పూర్తి చేయగలరు. సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా కొంతవరకు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వ్యాపారంలో ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. ఆర్థిక వ్యవహారాలు బాగానే ఉంటాయి. ఆరోగ్యం బాగా ఉంటుంది. సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణిస్తుంది. ఇదివరకు మీవల్ల ఉపకారం పొందిన బంధువులే యిప్పుడు మిమ్మల్ని వ్యతిరేకిస్తారు.

స్త్రీలకు—కుటుంబవ్యవహారాల్లో కార్యభారంపెరుగుతుంది. సాటివారితో మాటపట్టింపులురావచ్చును.

**మిథునం :** వృత్తి వ్యాపారాల్లో తరచుగా మీరు అనుకొనేది ఒకటి జరిగేది మరొకటి కావచ్చును గాని మీకు వ్యతిరేకంగా యేదీ జరగదు. భారీ యెత్తున చేసే వ్యాపారాల్లో మీకు సమయానికి కొంతమంది మిత్రుల సహకారం లభించగలదు. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. ఉద్యోగంలో కార్యభారం పెరిగినా, మీ కృషిని అధికారులు గుర్తించగలరు. వృత్తిలో కొంతమంది మిత్రుల వ్యవహారాల్లో జోక్యం చేసికోవలసి వస్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. కుటుంబ కార్యక్రమాలు ఒడుదుడుకులు లేకుండా నెరవేరుతాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగాఉండదు. విలాసవస్తువులుకొంటారు. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**కర్కాటకం :** వృత్తి వ్యాపారాల్లో ఆదాయం పెరిగినా, దానికి తగినట్లుగా వ్యయం కూడా పెరగడం వలనమీరు అదనంగా సాధించినదియేమీ ఉండకపోవచ్చును. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాల్లో అధికారులు మీ యెడల అనుకూలంగానే ఉన్నా, యితరుల జోక్యం వలన ఆలస్యం కాగలదు. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలకు లొంగిపోవడం వలన ముమ్ముందు యిబ్బందికి గురి కాగలరు. సాంఘిక కార్యక్రమాల్లో ప్రయోజనం గల వ్యక్తులను కల్సుకొంటారు. ఆరోగ్యం ప్రస్తుతం బాగా ఉన్నా, నిర్లక్ష్యం చేయతగదు. దైవకార్యాలు నెరవేరుతాయి.

స్త్రీలకు—కుటుంబవ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. సంతానానికి సౌఖ్యసంతోషాలులభిస్తాయి.

**సింహం :** మీ స్వంతపనులతో పాటు, యితరుల వ్యవహారాలను కూడా చూడవలసిన అవసరం యేర్పడడం వలన కార్యభారం పెరుగుతుంది. వ్యాపారం భారీ యెత్తున చేయడం వలన ఆర్థికంగా ఒలి డి కలుగుతుంది. వారం ప్రారంభంలో చేసే ప్రయాణాల్లో ప్రయోజనం కంటే ప్రయాస అధికంగా ఉంటుంది. వారం మధ్యనుంచి అన్నివ్యవహారాల్లోను అనుకూల పరిస్థితులు యేర్పడతాయి. కోర్టు వ్యవహారాల్లో యిదివరకు యేర్పడిన వ్యతిరేకత తొలగిపోతుంది. కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. శుభకార్యాల విషయంలో అభివృద్ధిని సాధించగలరు.

స్త్రీలకు—ఆరోగ్యంసంతృప్తికరంగాఉంటుంది. వినోదకాలక్షేపాల్లోపాల్గొంటారు. పుణ్యకార్యాలుచేస్తారు.

**కన్య :** వారం ప్రారంభంలో బాగా ఉంటుంది కాని మధ్యలో వ్యయ ప్రయాసలకు గురి కాగలరు. వ్యాపారంలో కొన్ని అవకాశాలు ఆకర్షణీయంగా కన్పిస్తాయి గాని అవి కార్యరూపాన్ని ధరించడం కష్టం. వృత్తిలో కొత్తవారి పోటీని యెదుర్కోవలసి వస్తుంది. ఉద్యోగంలో మెప్పుకురాని బాధ్యతను వహిస్తారు. రావలసిన డబ్బు మీద ఆధారపడి యితరులకు వాగ్దానాలు చేయడం తగదు. రాజకీయ వ్యవహారాల్లో వారాంతంలో అనుకూలతను సాధించగలరు. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. మిత్రులకు సహాయం చేయగలరు.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగానే ఉంటాయి. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు. సాటివారిలో గౌరవం బాగా ఉంటుంది.

**తుల :** ఈ వారం శుభాశుభ మిశ్రమంగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో కొంత అభివృద్ధిని సాధించినా, వారాంతంలో ఆకస్మికంగా చికాకులకు గురి కాగలరు. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా లాభిస్తాయి. వృత్తి రీత్యా చేసే ప్రయాణాలు లాభదాయకంగా ఉంటాయి. ఉద్యోగంలో వారాంతంలో చేయవలసిన నిర్ణయాలు వాయిదా వేయడం మంచిది. స్థిరాస్థి వ్యవరాల్లో అనుకూలమైన మార్పులు వస్తాయి. కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. వైద్యులకు మంచి సమయం.

స్త్రీలకు—ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. బంధువులవ్యవహారాల్లో మీ ప్రయత్నాలుఫలిస్తాయి.

**వృశ్చికం :** గ్రహబలం అనుకూలంగా ఉంది. వృత్తిలో మీ ఆలోచనలకు తగిన అవకాశాలు లభించడం వలన అధికాదాయంతో పాటు ఆత్మవిశ్వాసం కూడా లభిస్తుంది. వ్యాపారంలో మీకంటే పెద్దవారు కూడా మీ సహకారాన్ని కోరవలసి వస్తుంది. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. ఆర్థిక వ్యవహారాలు బాగా ఉంటాయి. శుభకార్యాల విషయంలో మీ ప్రయత్నానికి బంధువుల సహకారం లభిస్తుంది. సాంఘిక కార్యక్రమాల్లో ప్రముఖ పాత్రను వహించగలరు. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది.

స్త్రీలకు—కుటుంబ కార్యక్రమాలు కొంచెం శ్రమ మీద నెరవేరుతాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**ధనుస్సు :** వారం ప్రారంభంలో వృత్తి వ్యాపారాల్లో ఆందోళన కలిగించే పరిస్థితులు యేర్పడి వారాంతానికి సర్దుకొంటాయి. భారీ యెత్తున చేసే వ్యాపారాలు ప్రయోజనకరంగా ఉంటాయి. ఆర్థికంగా మీ స్వంత వ్యవహారాలు బాగానే ఉన్నా యితరుల నిమిత్తం శ్రమ పొందవలసి వస్తుంది. వృత్తిలో సాటివారితో పోటీ పెరగడం వలన మీ కార్యక్రమాలను మార్చుకోవలసి వస్తుంది. ఉద్యోగంలో యెవరినీ విశేషంగా నమ్మి వ్యవహరించడం మంచిదికాదు. సజ్జన సాంగత్యం లభిస్తుంది. కుటుంబ కార్యక్రమాలు ఒడుదుడుకులు లేకుండా నెరవేరుతాయి.

స్త్రీలకు—ఆరోగ్యం యిదివరకటి కంటే బాగా ఉంటుంది. సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణించగలదు.

**మకరం :** వృత్తి వ్యాపారాల్లో అన్ని వ్యవహారాలు అనుకూలంగానే ఉన్నట్లు కన్పిస్తాయి గాని మీరు యేమాత్రం యేమరుపాటుగా ఉన్నా, అవన్నీ మీది అనుభవం మరొకరిది కాగల పరిస్థితి యేర్పడుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో యితరుల జోక్యం వలన నష్టం వస్తుంది. నూతన వ్యవహారాలు ప్రస్తుతం లాభదాయకంగానే ఉన్నా వాటివల్ల ముమ్ముందు యిబ్బంది కలుగుతుంది. ప్రయాణాలు కొంచెం శ్రమ మీద ఫలిస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాల సంచలనం పెరుగుతుంది. [illegible] రోగ్యం చేయవచ్చును.

స్త్రీలకు—కుటుంబ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరుతాయి. అధిక వ్యయం జరుగుతుంది.

**కుంభం :** ప్రయత్నించిన ప్రతిపని సులువుగానే నెరవేరుతుంది గాని ఫలితం మాత్రం సంతృప్తికరంగా ఉండదు. వ్యాపారంలో మీరు యిదివరకు నిర్లక్ష్యం చేసిన వ్యవహారాలకు యిప్పుడు ప్రాముఖ్యత రావడం వలన యిబ్బంది కలుగుతుంది. వృత్తిలో నూతనావకాశాల కోసం చేసే ప్రయత్నాల్లో కొంతమంది మిత్రుల సహకారం లభిస్తుంది. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. ఆర్థిక వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. సాంఘిక కార్యక్రమాల్లో వాద ప్రతివాదాలకు దిగడం మంచిదికాదు. కుటుంబ సంతోషం లభిస్తుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగానే ఉన్నా, మానసికాందోళన కలుగుతుంది. అలంకార వస్తువులు కొంటారు.

**మీనం :** కొన్ని వ్యవహారాల్లో మీరు అదృష్టప్రాయంగా వ్యవహరించడానికి ప్రయత్నించడం వలన అనవసరమైన శ్రమకు గురి కాగల సూచనలు ఉన్నాయి. వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ఒడుదుడుకులు లేకుండా నెరవేరుతాయి. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలకు లొంగిపోవడం వలన ముమ్ముందు యిబ్బంది కలుగుతుంది. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరుతాయి. కోర్టు వ్యవహారాలు బాగా ఉంటాయి. బంధువుల వ్యవహారాల్లో యిదివరకు యేర్పడిన చికాకులు తొలగిపోతాయి. ఆరోగ్యం బాగా ఉంటుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో అధికవ్యయం జరుగుతుంది. శుభకార్యాల విషయంలో అభివృద్ధిని సాధించగలరు.

[illegible]



మాట్టల్, తొంగాటం, పతక్కం, నెక్లెస్: 'మాట్టల్' అంటే ఒక సన్నని వెండి పట్టాకి రాళ్లుపొదిగి చేసే నగ. దీని చివర ఒకటి చెవి దుద్దుకీ, మరొకటి కొస చెవిమీద జుట్టుకీ కలుపుతారు. 'పతక్కం' పాతకాలపు కంఠాభరణం. దీనికి సాధారణంగా కెంపులు ఉపయోగిస్తారు. 'నెక్లెస్' సంగతి సరేసరి. కాని బొమ్మలో కనిపించేది 'మల్లెపూవుల నెక్లెస్!'

# దక్షిణాది ఆభరణాలు

★

స్త్రీల అలంకరణలో నగలకి ప్రత్యేక స్థానం ఉందని చెప్పటం అనవసరం! కాని తక్కిన ఫాషన్‌లు మారినట్లే నగల ఫాషన్‌లూ మారుతూ ఉంటాయి. మయూరంలో ఉంటున్న శ్రీ ఎస్. రామకృష్ణ దక్షిణదేశంలో బాగా వాడుకలోవున్న కొన్ని నగల చిత్రాలు కొన్ని తీసి పంపారు. వాటిని ఇక్కడ వేస్తున్నాము. అయితే ఈ నగలలో చాలామట్టుకు ప్రత్యేక ఉత్సవ సందర్భాలలో మాత్రమే ధరించేవి మాత్రమే అనే అనుమానం రావచ్చు...

కాళ్లకి బంగారు వాడటం సాంప్రదాయం కాదు. మట్టెలు, గొలుసులు వెండితోనే చేస్తారు...



పూర్తి ముస్తాబు: ఈ బొమ్మలో చిన్నపిల్ల 'తలయసామాన్', 'జామికి', 'మాట్టల్' 'పవజ్యమాలయ్', బంగారు గొలుసులు, వగైరా ధరించి ఎంతో సంతోషంగా కనిపిస్తోంది!

ఎన్. రామకృష్ణ



మెట్టి: అరవంలో మెట్టెలని [illegible] పిలుస్తారు. ఇది [illegible]కర మయిన ఆభరణ మనే అభిప్రాయం ఉన్నది.



ముక్కు పుడక: తమిళదేశంలో వజ్రాలు కాక ముత్యాలు, కెంపులూ కూడా పొదిగిన ముక్కు పుడకలు వాడ్తారు. 'మూక్కుత్తి' దీని అరవపేరు...



ఒడ్డియాణం: ఒడ్డాణమే! ఈ కాలంలో ఈ ఆభరణం ఎప్పుడో తప్ప కనిపించదేమో...

# అతనిలోని మనిషి

అమరశ్రీ



కల్యాణీ!

ఏ అరమరిక

ఒక్కరి ఎదుట పరచుకున్నాం. ఆ ప్రేమ బంధంతో, అందమైన, మన గుణాల కనుగుణమైన ఆ కృతిలో జీవన కలశాన్ని తయారు చేసుకున్నాం. ఆ కలశాన్ని, కలిసిన మనసులనుండి ఒలికిన అనురాగ సుధతో నింపుకున్నాం. దానిపై, అందరి ముందర సమానమైన హక్కు పొందే సమయం ఆసన్నమవుతుంది. నేను నీ సన్నిధికి వస్తున్నాను. ప్రణయదేవీ! నేటికి మూడవ రోజే. ఇక మూగతనము వర్జనీయము. సిద్ధంగా ఉంటావుగా!

నీ

సుధాకర్.

ఆమె ఒక ప్రక్కకు ఒత్తిగిల్లింది.

"నీ సుధాకర్!" తృప్తిని వ్యక్తంచేసే హాసం నిండిందామె అధరాలపై.

"నేటికి మూడవ రోజు! అంటే రేపే! రేపే వస్తున్నాడు సుధాకర్." ఆమె హృదయం ఆనందంతో నిండింది!

"సుధాకర్"

అనురాగాన్ని వర్షించే కనుదోయితో, దట్టమైన వంకీల జుట్టునుండి విడివడి, చిరుగాలి కదలికలలో, చూపరుల దృష్టిని ఆకర్షించే రెండు అల్లరి వెంట్రుకలతో ప్రకాశవంతంగా కనిపించే పచ్చని ఫాల తలంతో, అలాగే చూడాలనిపించే అందమైన ముఖం—ఆమె మనోనేత్రంలో నిల్చింది.

ఆరోజే తలంటి పోసుకుందేమో, గాలి విసురులో హుషారుగా కదిలే కురులు ఆమె నును లేత చెంపలపై తారాడుతూ గిలిగింతలు పెడుతున్నా యామెలోని వూహాలకు ప్రతినిధుల్లా. రాత్రి పదకొండు గంటల వేళ, మెత్తని పరుపుపై ఉన్నా, ఆమెలో కదిలే మధురోహాలు, మంజుల భావాలు నిదురను నిర్లక్ష్యం చేస్తున్నాయి.

ఒకనాటి స్మృతి! మధురమైన స్మృతి ఆమె మనోపథంలో కదిలింది!

ఆనాడు, తన ప్రియనేస్తం పెండ్లికని పోయినప్పుడు అతను కనిపించాడు అనుకోకుండా! అతన్ని చూడగానే, మనోహరమైన అతని ఆకృతిని చూడగానే, అతనెవరో? అనే భావం తనలో తలెత్తింది ఎందుకో. తనలోని తహ తహలీరే అవకాశమా అన్నట్లు సావిత్రి అతనితో మాట్లాడుతూ ఉండడం చూసింది. తర్వాత సమయంచూసి సావిత్రిని అడిగింది.

"ఇందాక వివరితోనే మాట్లాడుతున్నావు?'' అని.

'వరుసకు అన్నయ్య అవుతాడు. పేరు సుధాకర్'' అని పోబోయి తన వాలకంచూసి ఆగి, "ఏం, చాలదా, ఇంకా వివరాలేమైనా కావాలా?'' అంది నవ్వుతూ.

సావిత్రి సంగతి తనకు బాగా తెలుసు. ఒట్టి అల్లరిపిల్ల. దానితో యేం మాట్లాడాలన్నా భయమే. అందుకని "వద్దులే" అంది తను.కాని అంతటితో వదలకుండా "ఊహూ! మాటలయితే అలా వచ్చాయిగానీ నీ ఆత్రత చెప్పటం లేదూ. చెప్తా విను. ఆయన చాల ంచివాడు. మా కందరికి. అంటే ఆయ ్లరిగిన వారందరికి. మంచి మంచి కథలు వాస్తాడు. చక్కగ కవిత్వం చెప్తాడు. యింకా యగా కబుర్లు చెప్తాడు. హాయిగా వ్వుతాడు. చాలా!'' అంది సావిత్రి.

దాని వాలకానికి తనకు నవ్వు వచ్చి చాలులే'' అంది. కాని, 'పత్రికలలో కథలు వాస్తూ, తన అభిమాన రచయిత్రలైన ుధాకర్, మా సావిత్రి అన్న సుధాకర్‌గారూ కరేనా?' అనే అనుమానం బయల్దేరింది నలో. ఆ సాయంత్రం అడిగింది సావిత్రిని ల్లి.

"సుధాకర్ అంటే పత్రికలలో కథలు వాసే ఆయనేనా?'' అని.

"ఎవరైతే యేం?'' అంది బెట్టుచేస్తూ విత్రి.

"ఊర్కేనే తెలుసుకుందామని—'' అంది ను.

"ఊర్కినే అంటే?''.. సావిత్రి నిలవేత.

"ఎందుకో అతన్ని గూర్చి తెలుసుకోవా నిపించింది'' అంది తను.

"ఎందుకో అంటే....?'' అంది రెట్టిం ప కొంటెతనంతో సావిత్రి. ఇలాటివే నేవో మాటలతో తనను తికమకలుపెట్టి, ంతటితో ఆగక, సాయంత్రం మా అన్న య్యతో చెప్తాను. ఎందుకో మా కళ్యాణి మ్మల్నిగూర్చి రెండు సార్లడిగిందని'' ంటూ పోయిన సావిత్రి మళ్ళీ ఉదయమే యారయింది.

'కళ్యాణీ భలే సంతోషకరమైన వార్త బుతా'నంటూ.

"ఏమిటి?'' అంటే,

"మా అన్నయ్య యేమడిగాడో తెలుసా?'' ంది.

"ఏమడిగాడేమిటి?'' అంది తను కుతూ లంగా.

చెప్తా నేమిటి?'' అందా పెంకిపిల్ల.

"చెప్పకు. అసలు నేను చెప్పమని అడిగానా? నువ్వే కల్పించుకుని, లేనిపోనివి వూహించుకుని, కొంటె చేష్టలతో నన్నేడిపిస్తున్నానని సంతోషించు'' అంది తను కాస్త కోపంగా. అదేం తీసిపోయిందా.

"నా దగ్గరా నీ నంగనాచి కబుర్లు. నేను కల్పించుకుంటున్నానేం? తమరుకాదు కాబోలు, ఆయన్ను తినేసేట్టు చూడ్డం, దొంగ చాటుగా నన్ను పిల్చి, సావీ అత నెవరే?' అని అడగటం! ఎందుకో యివన్నీ?'' అంది.

అవును. సావిత్రి అన్నది నిజమే! ఎందుకు ఏమని చెప్పను?

"ఎందుకంటే...ఎందుకంటే...వూర్కేనే'' అంది తను ఆఖరికి.

"ఊర్కేనేనా. అహా. అయితే నే వస్తా'' అంది బెట్టుగా పోబోతూ.

నిజంగా పోతుందేమోనని "ఇదిగో సావీ. ఆయనేదో అన్నాడంటివే, చెప్పవేం?'' అంది తను.

"వద్దన్నావుగా?''

"వేళాకోళానికయినా హద్దూ పద్దూ ఉండాలి'' అంది తను నిష్ఠూరంగా, నిస్పృహ యంగా.

"మరి నా దగ్గర బెట్టు చేస్తే యెలా? బుద్ధిగా చెప్పేది విను. కావలసింది అడుగు'' అని గొంతు సవరించుకుని, "నన్ను నీలాగే దగ్గరికి పిల్చి, చెల్లాయ్! ఆవిడెవరు?''అన్నారు అంది సావిత్రి.

ఎందుకో ఆ మాట తనలో నూతన మైన ఆనందాన్ని కల్గించింది!!

పెళ్ళిఅయి పోబోయేముందు, తన దగ్గరికి వచ్చి, హఠాత్తుగ అడిగింది సావిత్రి.

"అన్నయ్యని నువ్వు ప్రేమిస్తున్నావా?'' అని.

దాని కేమని జవాబు చెప్పాలో నాకు తోచలేదు. అంత అవకాశమివ్వకుండానే "అన్నయ్య నిన్ను ప్రేమిస్తున్నారు. మీ యిద్దరిదీ అపురూపమైన జంట అని నా ఉద్దేశ్యం. నువ్వు కావాలనుకున్నప్పుడు కార్డు వ్రాయి'' అని అడ్రసు యిచ్చింది.''

ఆతర్వాత కొద్దిరోజులకే సుధాకర్ని ప్రేమిస్తున్నాననే నిర్ణయానికి వచ్చింది తాను. ప్రతిసారీ పుస్తకం చేతికి వచ్చినప్పుడల్లా సుధాకర్ వ్రాసిన కథ, ఉండే పేజీ కోసం ఆత్రంగా వెతికేవి తన కళ్ళు. ఆయన రచనలపట్ల తను వ్యక్తంచేసే అభిమానాన్ని, అనేక్సార్లు గమనించి తన స్నేహితురాండ్రు అడిగే

ఆరాధించటం లేదు కదా? అలా అయితే యీ యేకాంతసేవలెందుకూ? ఏకంగా స్నేహం కలుపుకుని అతని కాంతవు కారాదూ'' అని. ఆనాడు తనలో ఆమాట లేవిధం గానూ ప్రభావం చూపలేదెందుకనో. కాని ఆయన్ని చూచిన తర్వాత ఆ మాట లెంతో మధురంగా అనిపిస్తున్నాయి తనకు. తనే మొదట ఉత్తరం వ్రాసింది. కేవలం ఆయన కథలంటే యిష్టపడే ఒక అభిమానిగా. తను ఆశించినట్లుగానే అతన్నించి రిప్లైవచ్చింది. ఆనాటినించి తమ మధ్య నిరాటంకంగా సాగిన ప్రణయం నానాటికీ వృద్ధి అయి, యీనాటికి పూర్ణంగా సిద్ధించింది. ఒక నాటి తన కలలు ఫలించాయి. వూహాలు వాస్తవం కానున్నాయి. 'సుధాకర్! ఎంత అందమైనవారు! ఎంత గంభీరులు!! ఎంత చిలిపివారు!!!' ఎందుకో ఒక్కసారి సుధాకర్ వ్రాసిన ఉత్తరాలన్నీ చదివాలనిపించిం దామెకు. అప్పుడే లేచి పెట్టెలో భద్రంగా దాచిన ఉత్తరాల కట్టనుతీసి ముందేసుకుంది!

"మీరు కోరకపోయినా జవాబు వ్రాయటం నా ధర్మం. లేకపోతే ఋణగ్రస్తుణ్ణై పోతానేమో! మీవంటి అభిమానుల ఉత్తరాలెంత సంతోషాన్నిస్తాయో చెప్పలేను. మరి మీరు చెప్పమన్నట్లుగానే ధన్యవాదాలుచెప్తాను నా కలంతో! కృతజ్ఞతగా యీ లెటరు వ్రాయమంది. కలంతో ఎలా మాట్లాడగల్గుతున్నానా! అని ఆశ్చర్యపోకండి. నా భావాలను బాగా అర్థం చేసుకుని నేనూహించిన దానికంటె అందంగా రూపొందిస్తుంది నా కలం! అందుకే మా కిద్దరికి పరస్పరం ఒక భాష ఉంది. ఎందుకో యిప్పుడు హుషారుగా కదులుతుంది! అయినా, వారించి ఇంతటితో ఆపుతున్నాను.

అనురాగంతో
సుధాకర్.

కళ్యాణిగారూ,

నాకొక చిలిపి చెల్లాయివుంది. సావిత్రి అని. ఆ అమ్మాయి పదిరోజులక్రితం నా దగ్గరికి వచ్చింది "అన్నయ్యా, భలే సంతోషకరమైన వార్త తెచ్చాను నీ కోసం'' అంటూ. "ఏమిటని?'' అడిగితే, ఒక అడ్రసుయిచ్చి "ఈ అమ్మాయిపేరు కళ్యాణి. నా స్నేహితురాలు. మీ రచనలన్నా, మీరన్నా భలే యిష్టమట! మొన్న మన ధామూ అన్నయ్య పెళ్ళిలో నువ్వూ చూపే ఉంటావు. వచ్చిన, ప్రత్యేకంగా, చుక్కలో చంద్రునిలా, తిరిగే

తీసుకుంది. మీతో స్నేహం చేయాలని ఉందట. బహుశా రెండు మూడు రోజుల్లో ఆమెదగ్గర్నించి కార్డు రావచ్చు'' అని చెప్పింది. ఆమె చెప్పినట్లే కల్యాణి పేరుతో కార్డు రానే వచ్చింది. మా చెల్లాయి చెప్పిన కల్యాణి, మీరూ ఒకరే అయి ఉంటారని పించింది నా కెందుకో! ఇప్పుడు తెలిసింది గదూ, మీ అడ్రసు ఎలా తెలిసిందో! పోతే సంబోధన. మీ యిష్టం ఎలాగైనా నాకు సంతోషమే!

అనురాగంతో
సుధాకర్.

కల్యాణిగారూ,

ఏమైనా మీరు మా సావిత్రిని అంతగా సెవ పెట్టడం నేను మిన్నకుండలేని విషయం. ఎందుకంటే, మా సావిత్రి మీ రన్నట్లు అల్లరి అమ్మాయి మాత్రమేకాదు. అందమైన ఆంతర్యం గలది. చిన్ననాటినుంచీ నా గుణగణాలూ, నాలోని విలువల్ని తెలుసుకోగల్గిన వారిలో మొదటిది మా సావిత్రే. పైగా నేనంటే ఎనలేని అభిమానం. గౌరవం. అందుకని మీబోటి వాళ్లముందు నన్ను గురించి కొంచెం గొప్పగా చెప్పడంలో అతిశయోక్తి లేదేమో! ఆమె చిలిపిగానైనా, కొంటెగానైనా ఏమి చెప్పినా, ఏమి చేసినా అర్థరహితంగా చేయదనే నా అభిప్రాయం. అయినా మా సావిత్రిపై మీకు కోపం లేదని వ్రాశారు గాబట్టి సరిపోయింది. లేకుంటే, మీమీద నా కెంత కోపం వచ్చేసేదో!

అనురాగంతో
సుధాకర్.

కల్యాణిగార్కి,

అభిమానం అడిగితే వచ్చేదికాదు. కేవలం యిచ్చిపుచ్చుకునేది. మీరెంత అభిమానం నా కిస్తారో అంత అభిమానాన్ని మీకిస్తాను నేను. ఇకపోతే నా కథలు, పాత్రల చిత్రణను గురించి అడిగారు. మీరన్నది నిజమే. కాని, నేను వ్రాసేది నిజమేనని నా నమ్మకం. ఏమైనా పుస్తకాల్లో కనిపించేంత, వూహాగానాల్లో అనిపించేంత సులభమైంది, అందమైందికాదు జీవితం. కష్టసుఖాలు అంత సులభసాధ్యాలు కావు. ఒకసారి జీవితంలో కష్టం సంభవించిందంటే, జీవిత భాగంలో ఆ కష్టం తాలూకు కష్టం అనుభవించాల్సి ఉంటుంది. అంతే. దానితర్వాత ఎన్ని సుఖాలు కల్గినా ఆ కష్టంతో నష్టపడగా మిగిలిన మనిషే ఆ సుఖ ఫలితాన్ని అనుభవించగలడుగాని అప్పటికే జరిగిపోయిన నష్టాన్ని పూర్తి చేయలేడు. కేవలం ఒక చక్కని వూహా, తీయని కల మాత్రమేకాదు జీవితం. ప్రతి పాత్రను నేనై దానిలో జీవించి, ఆ అనుభూతిని పొందుతూ వ్రాస్తాను నేను. ఊహాపరంగా గాకుండా వాస్తవ సంఘటనలు ఎదురై అనుభవానికి వచ్చినప్పుడే వ్యక్తిగాని, రచయితగాని నిజంగా వర్ణించగలడు. అక్కడే వాస్తవ కంపనలోని విలువ తెలుస్తుంది. నేనే ఎన్నో మాంత్రికుల కథలు, ప్రణయ గాథలు వ్రాశాను. ఎందరినో పాములచేత, పులులచేత కరిపించాను. విషము త్రాగించాను. మరణా సులభంగా బ్రతికించాను. కాని నేనొక తెలుచే కరువబడిననాడు తెలిసింది నా వూహ లెంత వాస్తవదూరాలో పేలవమైనవో! అందుకే సాధ్యమైనంతవరకు, అవెంత కఠినాలైనా, చేదుగావున్నా వాస్తవానికి దగ్గరగా వ్రాయాలనేది నా నిర్ణయం.

అనురాగంతో
సుధాకర్.

కల్యాణిగారూ,

"ప్రేమ!" ఎంత అందమైన మాట! ఎంత ముఖ్యమైనది!! ఎంత అపాయమైనది!!! ప్రేమంటే కేవలం ఒక భావం. సుషుప్తిలాంటి ప్రశాంత స్థితిలో అన్ని బలహీనతలకూ, బంధాలకూ అతీతమైన అవస్థలో, మనసు నిశ్చల నిర్మల సమాధిలో శివమైన ప్రాంగణాలలో నిరావేశంగా విహరించే వేళలో, ఎక్కడ్నో హృదయాంతరాళంలో కదిలే, ఏర్పడే అనుభూతియే నిజమైన ప్రేమ స్వరూపం.

క్షణికమైన ఆకర్షణలూ, నిత్యమూ సంఘటితమయే నిష్పృహలూ, భంగపాటూ అవమానాలకు అతీతమైన, సర్వత్రా మారులేని రూపంలో ఉండే నిర్మల భావమిది.

ఆ ప్రేమలో ఆకర్షణ ఉంది—ఎన్నటికీ తరగనిది. మమత ఉంది—ఏనాటికీ మాసిపోనిది. అన్నిటికీమించిన పాళ్లలో త్యాగముంది—పరిస్థితుల తీవ్రతకు జడియనిది, సడలనిది. నిరాడంబరమైన ఆ భావం మరుగున సరాగం విరాగం సమపాళ్లలో ఉంటాయి. ఆనందం విషాదరూపంలో నిక్షిప్తమై ఉంటుంది. ఇదే నా దృష్టిలో ప్రేమ స్వరూపం.

అనురాగంతో
సుధాకర్.

ఏమన్నారూ! 'మీరు నన్ను ప్రేమించగలరా?' అనా. దీనికి జవాబు చెప్పే ముం

క విషయం స్పష్టంగా చెప్పాలి.

నిత్యవాస్తవ జీవితానికి, మృదులమయి ప్రేమకూ చాలా దూరం. నిత్య వాస్తవ, నిష్ఠురమైన జీవితం, జీవితావసరాలూ వేరు. నిరామయము, ప్రతిఫలాపేక్ష రహితమూ అయిన ఆ భావం వేరు.

వినిర్మలత, పవిత్రత, నిస్వార్థత, త్యాగశీలత, అంతులేని ఆప్యాయత ఆజ్యాలు కాగా అద్భుతమైన తేజంతో వెలిగే ఆ అనురాగ జ్యోతిని దరిసే అర్హత మానవులకు లేదేమో. ఒకవేళ ఆకర్షణా దుస్సాహసంతో దాన్ని సమీపించినా, ఎన్నో బలహీనతలూ, స్వార్థాలూ, అవివేక ఆవేశ కావేషాలూ, ఆత్మవంచనలూ, కల్పితానందాలుతో క్షుద్రమాకర్షణులతో పరివేష్టితుడై మానవుడు, సుందర వికృత రూప భేదమెరుగని మానవుడు ఆ జ్యోతిలో లీనం కాలేడు. అందుకే ఆ అనురాగ జ్యోతికి దూరంగా నిలిచి, ఆ కాంతి కదలికలలో నిలవిని తిలకిస్తూ ఉందాం మనం. ఏమంటారు?

అనురాగంతో

సుధాకర్.

కళ్యాణిగారూ,

అనురాగానికీ, జీవితానికి పొత్తులేదనికాదే కాదు నా అభిప్రాయం. మనుగడకు చుక్కాని వంటిది మనసు. ఎందవాందమలయానిల వీచికలు ఆశాపథాల వెంట నడిపించవచ్చు మనుగడ నావను. సుడిగాలులు విజృంభించి, బ్రతుకు బాటనే కల్లోలంచేసి అఘాతాలలో పడద్రోయవచ్చు. కాని ఆ అఘాతాలను సుడిగుండాలను సైతం తరించగల అసాధారణ శక్తిని కల్గించగలదు మమతారజ్జువు. అదెక్కడా, ఏ ప్రశాంత తీరానికో, మనుగడ ఓడను బలంగా బంధించి వేస్తుంది. మమతే—ఒకవిధంగా మనుగడకు మూలం. ఆశారూపాలతో, నమ్మకం, త్యాగం మానవాళిని తనతో బంధించి వేస్తుంది. అదే ప్రేమ, ద్వేషం, వివిధ రూపాలలో మనిషిని నడిపిస్తుంది.

రాగబంధం మధురమైనదే. అది అందర్నీ బంధిస్తుంది. కాని యింకా ఎన్నో ఉన్నాయి. జీవితంలో, నీవు గమనించలేదా? 'అనురాగంతో' అని వ్రాస్తున్నాను. అంటే నాలోని అనురాగం మీకూ పంచుతున్నాను. కాని నువ్వు నానించి కోరే అనురాగం ఆ లక మైన అనురాగంకాదు. ఎవేవో ఆశలతో కోర్కెలతో కూడినది కావచ్చు.




ఆశలూ, ఆశయాలూ లేని మానవునికీ, నిస్పృహలూ, పరాజయాలూ భంగపాట్లు ఉండవు. నాపై నా రచనలపై మీకు కల్గిన అభిమానం చాలదా! అంతకంటె ఎక్కువ అనుబంధం ఉండకపోతే ఏం?

అనురాగంతో

సుధాకర్.

కల్యాణిగార్కి,

మీరన్నట్టు నేను ప్రజ్ఞానిధినికాను. అతి సామాన్యమైన మానవుణ్ణి. నాలోను అనురాగం ఉంది. ఈ సువిశాల సృష్టిలోని ప్రత్యణువు నన్నాకర్షిస్తుంది. నాకూ వయో సహజమైన పులకింతలు, అనుభూతులు ఉన్నాయి. కాని ప్రకృతి ఆదేశానుసారం కొందరు కొన్ని సుఖాలకు దూరం కావాలి. అందరూ అన్నీ పొందాలని ఎక్కడుంది.

మీరెన్నో వూహించవచ్చు. ఇంకా మధురంగా మీ భావనా శక్తి మేరకు వూహించండి. కాని, సంపూర్ణ పూరితమూ, అతి నిష్ఠురమూ ఐన జీవితంతో ముడివేయ జూడకుండా, వూహాల్ని. ఉత్తరాల ద్వారా మన మధ్య చిగురించిన అభిమానం కేవల ఉత్తరాల రూపమైన అభిమానంగానే పరిమితం కానీండి. కల్యాణిగారూ, లోకం విచిత్రమైంది. జన్మించిన ప్రతి జీవి మధ్య ఏదో విధమైన రాగబంధం కల్పిస్తుంది. ఆ బంధంలేనిదే మనుగడ దుర్భరమనేంత గాఢంగా. కాని, ఆ అనుబంధం సఫలతనొందేలోపునే ప్రతిబంధకాలనేకం. నా

'మనమధ్య ప్రేమ ఎందుకుండరాదూ?' అని కదూ అడిగారు. మానవాళి మధ్య మమతలు పంచి, మంచినిపెంచి, ఈర్ష్యా ద్వేష వ్యసనాలకతీతమైన, పవిత్రమైన అనురాగ మేదో దానినే మన మధ్య యేర్పరచుకున్నామిప్పుడు. ఈ అనురాగానికి తనువుల సామీప్యంతోగాని, కన్నుల కలయికలతోగాని నిమిత్తంలేదు. పైగా దూరం అపారమైన కొలదీ అది అపరిమితంగా వృద్ధి చెందుతుంది. అంతకంటె మించిన అనుబంధ మేదీ పెంచుకోవద్దని ప్రార్థిస్తున్నాను మిమ్మల్ని.

అనురాగంతో

సుధాకర్

కల్యాణీ,

నిజంగా నా జవాబు మీకు బాధ కల్గించిందా? పోనీలే, అనుభవమైన బాధ పరిమాణం తెలుస్తుంది. కానున్న అనుభవాలేమిటో ఎవరెంత తీవ్రంగా బాధిస్తాయో ఎవరికీ తెలియదు. కాని కొన్ని కొన్ని వూహించవచ్చు. అందుచేతనే నేనంత ఖచ్చితంగా వ్రాయాల్సి వచ్చింది. నీకు బాధ కల్గించాలనే ఉద్దేశ్యంతో మాత్రంకాదు.

పోనీ, నీవే కోరితే, నేనేదయినాయిస్తాను అనేకంటె నీ ఆనందంకోసం నేనేమయినా చేస్తాను అని చెప్పగలను. ఇవి నా హృదయంలోంచి వచ్చే మాటలు. నాకూ ఒక మోహన రూపాన్ని ఆరాధించాలనే ఉంది. ఒకనాడు నా హృదయంలో కదలిన భావాలు కారణాంతరాలవల్ల యీమధ్య మరుగుపడినాయి. ఆ భావాలు ఎవరికో వెల్లడించ

# అతనిలోని మనిషి

లనే తహతహ యింకా తీరలేదు. ఆ అవకాశం మీ రిస్తానంటే కాదనగలనా? మీరన్నట్టు బండబారిన నా హృదయంలో ఏమారు మూలో నిక్షిప్తమై ఉన్న భావాలను నన్ను కోరే, నాకు కావలసిన వారికి నివేదించి నా హృదయరీతి నెరిగించే అవకాశ మిస్తానంటే కాదనేంత గట్టి హృదయం కాదు నాది.

సంబోధన చూశారా! ఎందుకో 'కల్యాణి' అని వ్రాసి ఒక వాక్యం మొదలు పెట్టిన తరువాత చూసుకున్నాను. అరే! "గారు" పెట్టనుమరచానే! అనిపించినా ఎందుకో అలాగే ఉండించాలనిపించింది. ఇక నానుంచి మీకు కావలసిన చనువేదో తీసుకునేందుకు వెనుకాడరుగా! మీ

సుధాకర్

కల్యాణీ,

ప్రేమ తత్వ మేమిటో ముందే చెప్పాను. ఇప్పుడు నేను నిన్నెలా ప్రేమించినా, కొన్ని నాళ్లకది విడదీయలేనంతగా నీతో నన్ను బంధించివేస్తుంది. మొన్న మొన్నటివరకూ సారవిహీనంగా, లక్ష్యరహితంగా సాగే నా బ్రతుకులో వసంతంలా ప్రవేశించావు నీవు. నా కొక నూతన శాంతివి, నవ్యానందాన్ని యివ్వగల మనోహరమూర్తివి నీవు. నీలో నన్ను కదిలించి ఉత్తేజ పరచగల అపూర్వ శక్తి ఉంది. నిన్ను గూర్చిన భావనాలేశం ఎంతో బరువైన విషాదాలోచనల్ని కూడా దూరం చేయగలదు. ఇవన్నీ ఆవేశంలో, యేదో ఆకర్షణకు లోనై చెప్పే మాటలనుకోకు. నా ఆత్మస్పందనలోని భావి జీవన రూపమే నీవు. మన రెండు ఆత్మల కలయికకు పవిత్రబంధమైన, నిశ్చలానంద పూరితమైన, అనురాగాలతో మన హృదయాలను పెనవేయగలదైన దేశ కాల పరిస్థితులకు తన స్థిరత్వాన్ని కోల్పోనిదైన, మార్పులేని అనురాగ రూపమే నన్ను నీతో బంధించింది.

ఏం కల్యాణీ, యిప్పుడు తెలిసిందా నా ప్రేమ స్వరూపం. నా హృదయరీతి. ఇంకాయేమైనా సందేహాలు మిగిలి ఉంటె అడుగు చెప్తాను. నీ

సుధాకర్

కల్యాణీ,

ఎందుకో యీ 'కల్యాణి' అనే సంబోధన అంతగా బాగాలేదనిపిస్తుంది. గౌరవంగా 'కల్యాణిగారూ' అన్నాను. అంత మర్యాద నాకు వద్దన్నావు. స్వతంత్రించి "కల్యాణీ" అన్నాను. మౌనంగా ఉన్నావు. నీ విచ్చిన చనువుకు, యింకాస్త జత కలపాలనీ, నువ్వు రమ్మన్న దానికంటె యింకా నీకు దగ్గరగా రావాలనీ, నీదైన నా హృదయం తొందర చేస్తుంది. అందుకే, ప్రేయసీ, ప్రియతమా, ప్రణయదేవీ, నా హృదయరాణీ! అని యింకా, యింకా యేవేవో కమ్మని పదాలు జత గలిపి సంబోధించాలని ఉంది. ఏమంటావ్ నీవు. నీ

సుధాకర్

ప్రియమైన కల్యాణి,

ఏమంటున్నావ్! నేను దుస్సాహసినా. నిజమే. నేను సాహసినే. కాని నీవు చేసిన సాహసిని. పరుగులుతీసి పారి పోతాచేసిన వాన్ని దరిజేర్చుకోగోరిన వారికావ్వాలంటె సాహస ముండాలి మరి! ఏమిటో, అపురూపమైన అంత అందాన్ని మనువ్వాజతో ఆరాధించేందుకు హృదయం వేగిరపడుతుంది కలలరాణీ! కనీసం కలలోనైనా సాక్షాత్కరిస్తే..... నీ

సుధాకర్.

కల్యాణీ!

ఇప్పటివరకూ నే నాలోచించేది. ఆకాశంలోని అనంతాన్ని, అనంతంలోగల శూన్యాన్ని, ఏకాంతంలోగల అంతాన్ని, నిశిధిలోగల నిరాశలను గూర్చి మాత్రమే. నీ మూర్తి వచ్చి నా ముందు నిలబడి 'ఏమిటంత దీర్ఘంగా ఆలోచిస్తున్నావు?' అని అడిగి నట్టైంది.

'ఆ, ఏమీలేదు. ఏమిటీ జీవితం? ఎందుకు...'

'...జీవించాలి. ఇలా జీవించి జీవించి ఎంతకాలం జీవించాలి? ఏమి చేయాలి? అఖరికి ఏమి కావాలి? ఇదేగా నీ ఆలోచనల సరళి' అంది కాస్త కోపంగా.

అవునన్నట్లు తలూపాను నేను. "ఛీ, ఛీ, 'ఏమిటీ పాడు ఆలోచనలు! అసలెందుకు అర్థరహితంగా ఏవేవో, ఎప్పటివో ఆలోచిస్తూ లేనిపోని బాధలు [illegible] తెచ్చుకోవడం. ఇవి తప్పనిసరిగా ఆలోచించవలసినవారు వేరే ఉన్నారు. లేనువ్వు. [illegible]ంచిలే వస్తాను.'' అన్నావు కన్నులలో అసహనం వ్యక్తమవుతుంటే. 'ఎందుకూ, ఎక్కడికీ' అంటూ లేచాను. 'ఇలారా! యీ అద్దం ముందు నిలుచో!! చూడు! ఎంత లేత వయసో. ఒకచోట నిలువక ఆ కన్నులలా కదులుతుంటే, ఎంత సహజంగా ఉందో చూడు. ఏవేవో చూడాలనీ, ఎన్నో

కలలు గనాలని నాటి తన తహల్ని అణచి, ఏందు కలా విశ్వాలంగా యేమీ లేని శూన్యంలో నిలపాలనుకుంటావు?

"మరి నేనేమి చేయాలి?" అన్నాను.

'కనులలోని ఆశల రూపాల్ని, వెన్నెల వెలుగుల్ని విశదం చెయ్! హృదయ స్పందనలో గల చైతన్యాన్ని చాటు. లేత గుండెలలో పొంగే ఆనంద ఝరీ వేగాన్నిగూర్చి నీకోసం వేచిన సాక్షా, లోకానికి తెలుపు.' అంది నీ మూర్తి. నేను సరేననక యేం జేస్తాను! పూవు విరిసింది. పరిమళం వెదజల్లకుండా ఉండగలదా?

నీ
సుధాకర్

ప్రియతమా కల్యాణీ,

ఏమిటీ! నా పేనాలో చిలిపి రంకు పోస్తున్నానా!! ఇప్పటి వరకు యేమోకాని యికనుంచి పోస్తాను. ఏమన్నావు? నీవు బాలికవా! అమ్మమ్మా!! నానేకాదు. బాల్యప్రాయానికేమిటి! ఇంత కలవరముండట మేమిటి!! ఆకర్షణతోనే అనురాగాన్ని నీ చుట్టూ తిప్పించుకోగల సంపూర్ణ వికసిత సుందర సుమానివి! మనుషుల హృదయాన్ని తీయగా కాల్చివేయగల వలపు జ్వాలవు నీవు.

ఎందుకు కల్యాణీ, సన్నిహితత్వాన్ని వాంఛించి మనమధ్య స్నేహానురాగబంధానికి కారణమైన యీ యోగాన్ని పారద్రోలాలని చూస్తావు. దేనికయినా సమయం రావాలి. త్వరలోనే నీ దరికి రా ప్రయత్నిస్తాను.

ఆనాడు పెండ్లిలో నిన్ను చూశాను. కాని ఏమైనా నాకు కల్గిన అభిప్రాయం "ఒక అపురూపమైన సుందర రూపం" అని మాత్రమే. కాని యీనాడే ఆనాడయిఉంటే చేసుకునేవాణ్ణో తెలుసా!

ఆమె కన్నులలో నా జీవన జ్యోతుల్ని చూస్తాను. సువర్ణకాంతులు వెదజల్లే ఆమె మను చెంపల కెంపులలో నా జీవన మాధుర్యాన్ని నిక్షిప్తం చేస్తాను. విలాసంగా కదిలే పెదవుల సలలిత లాస్యంలో, నా జీవన వసంతంలో ఎకసించే సుమగంధాల్ని ఆఘ్రాణించగలను. ఆమె అడుగుల సవ్వడిలో నా ఉత్తేజాన్ని, ఉత్సాహాన్ని గుప్తం పరుస్తాను. పద్మ సంభవుని కళాసృష్టిలో, మనోహరాకృతిలో సంభవమై, పరువపు గరువాన పంపు సొంపులతో, అందంగా అమరిన అవయవసౌష్ఠవంతో, పసిమి మేలిమిఛాయతో మిసమిసలాడే ఆమె మృదుదేహంలో యౌవన సహజమైన కమ్మని కలలచే రూపొందిన సుఖానుభూతుల ఆనంద నిస్వనాల్ని వినగలను. ఇంకా యింకా ఎన్నెన్నో మధురోహలు కల్గుతాయి నీ మూర్తి నిచూస్తే. నా ఆశలను చిగురింపజేసి, నా మనసులో మల్లెలు వెదజల్లిన ప్రణయమూర్తివి నీవు. శాంతి సంతోషం, ఆశల భావనల్ని అనుభవంలోనికి తెచ్చిన ఆనందానివి నీవు. అందుకే నీ స్వంతమయ్యాను నేను. ఆ భావం నా కెంత ఆనందాన్నిస్తుందనుకున్నావు!

నీ
సుధాకర్.

కల్యాణీ,

"ఇప్పుడూ అభిమానులవద్దనించి ఉత్తరాలువస్తున్నయ్యా?" అని కదూ అడిగావు. రాకేం. ఎప్పటిమాదిరి వస్తూనే ఉన్నాయి. కాని వాటిలో క్రొత్తదనం ఉంది. కొన్ని వాక్యాలు వినిపించమంటావా?"

"శైలి లలితమే అయినా, ఉదాత్త భావాలతో, విషాద వాతావరణంలో ('విషాద ప్రియ' అని కూడ పేరు పెట్టాము మీ కలానికి.) సంచరించేవి మీ భావాలు. కాని యిప్పుడు చిలిపితనం పర్వులెత్తుతున్నాయి. మీ లేఖిని యువలోకాన్ని తీయని భావాల్లో పులకలెత్తిస్తుంది." ఇలాంటివే. ఏమిటంటావు కల్యాణీ దీనికి కారణం. నీవే చెప్పాలి. ఇంతకుముందు అన్నీ....ఉండుండు! పూర్వపు ఉత్తరాలు కొన్ని చూచి చెప్తాను.

"మీరు మనుగడ పరమార్థమేదో కనుగొన్నారా? జీవితంపై విసిగి వేసారినవిషాద వ్యక్తులే మీకు పరిచయస్తులా? లోకంలో దారిద్ర్యం, అశాంతి, అసంతృప్తి తప్ప యింకేమీ లేవనేనా మీ ఉద్దేశ్యం? 'పుట్టుట—మనుగడ—గిట్టుట' వీటిని అంత దగ్గరగా, వ్రాసినట్లే ఎందుకు చూస్తారు మీరు? అయినా మీరు చిత్రించే పేదల వేదనామయ గాథలూ, ఆకాశాన ఎంతో ఎత్తుకు ఎగరజూచే నవనాగరికతలోని బలహీనతకు 'నిదర్శనాలు.'' ఇలాంటివి. ఎందుకు యింతలోనే యింత అంతరం సంభవమైందో చెప్పు చూద్దాం!

నీ
సుధాకర్.

"ఎంతకాల మీ అంతులేని వింత అవస్థ అంటున్నావా! నన్ను నీ దగ్గరగా చూడాలా? అంత తొందరెందుకు అప్పుడే. నా కలల మాధుర్యంలో, నా భావనా సుషుప్తిలో ఒక సుందరతర కళాసరసిని వెలకొల్పుతున్నాను. దాన్ని నా జీవనానికి సరిపోయే అనురాగామృత జలంతో నింపుతున్నాను. ఆశాచిరుగాలి తరగాలచే జనించే ఆ సుధా తరంగాలపై అందమైన అపురూపమైన, నా జీవన కల్యాణి అనదగిన కలువ కన్నెను నెలకొల్పాను. ఆనరసి వాచే నిర్మితమైనదైనా, నా కనని దూరంలోనే ఉన్నా అసమయంలో దానిని చేరవచ్చునా? అయినా నీవు త్వరపడుతున్నావు కాబట్టి ఆ రోజు కోసం ఎదురు చూస్తుంటాను.

చూశావా కల్యాణి! ఎక్కడో హృదయసీమలో యే మూలో కదిలిన నిన్ను చేరాలనే



# అతనిలోని మనిషి

ఆలోచన నెలా పసిగట్టాడో, నన్ను చూసి శబ్దం లేకుండా నవ్వుతున్నాడు చంద మామ. మరి,ఎలానవ్వగల్గుతున్నాడో! ఎన్నేళ్ళ నించో ఆ కలువనుగానీ, ఏ తారనుగానీ ఊరించడమే తప్ప దరిజేరి మురిపించి ఎరుగడు. తన ఓపిక, నిరీక్షణ అందరికీ ఎలా ఉంటుందనుకున్నాడో! నవ్వనీ.

సి
సుధాకర్

నా హృదయరాణి కల్యాణి,

హఠాత్తుగ మెలకువ వచ్చింది. ఏదో కల. మధురమైనదేలే. అయినా ఏదో వెలితి తోనే అంతమయింది. మనసును తీయని తలుపులు ముసిరాయి. ఒంటిగంట చూపు తుంది గడియారం. ఎక్కణ్ణించో సన్నని రాగం విన్పిస్తుంది. లోకమంతా నిద్ర పోతుంది. మరి నడిరేయి నిద్రను దూరం చేసుకొనడమేమిటి? అనుకుంటున్నావా? ఏమిటో మరి? నీ దగ్గరికి చేరాలనుకున్నాను అప్పటినించీ యిదే అశాంతి. నిద్రలో కూడా కలతే. కలవరమే. అయినా యిప్పుడు నీ దగ్గరికి రాలేనుగా. ఎలాగో ప్రయత్నిం చాలి నిద్రకు. తీయని అశాంతీ, నిద్రా రెండూ పోటీ పడ్డాయి నా కోసం. కమ్మని తలపులు ఒక మధురాకారంగా రూపొంది, నా హృదయంపై నాట్యం చేస్తున్నట్లు యింది. కనురెప్పలు మత్తుగా మూసుకు న్నాయి. మన సేదో గుస గుస లాడుతుంది, ఏదో నివేదిస్తూంది నీమూర్తితో.

"దూరానవున్న నీవు—
దరిజేరి కూర్మిమీద
వ్యధనొందు లేత హృదిని—
సుధ జిలుక జాలవేమి?
వినలేని దూరమందు—
కనలేని రూపు దాల్చి
వెనరైన వాలకమున—
కనిపింతు వెల్లవేళ.
ఎదలోన మధురభావ—
మృదుతల్ప మందు నీవు
సుఖమైన స్వప్నసీమ—
నిదురించజాలవేల?
ఏకాంతమందు నాకు—
ఏకాంతి కానరాదు.
కనగోరి నీదురూపు—
కనుదోయి మూతపడదు
నీ మూర్తి కొరకు వెదకి—
వే నార్తి జిక్కినాను

మనలేను యీ విధాన—
మనమందు శాంతిలేక."

ఈ గుస గుసలు వస్తుని నిద్రాదేవి వేసారి పారిపోతుంటే, కేకవేసి నా యీ బాధను నీతో చెప్పమన్నాను. బహుశా యీ సమయంలో నీవు నిద్రాదేవి ఒడిలోనే ఉండవచ్చు. ఏం, ఈ విషయం నీతో చెప్పిందా, కలల రూపంలోనైనా. ఎందుకో ఒక్కసారి, ఒక్కక్షణమైనా నిన్ను చూడాలని నా హృదయం తొందర చేస్తుంది. నవ్వుతున్నావా. నా హృదయ బేలత్వానికి. ఏం చేయను కల్యాణి! చల్లని గాలి వీచి తనువును సోకి హాయిని గొల్పినపుడు నీ తలపేదో మెదుల్తుండే. నీ తలపేదో మదిలో మెదిలినపుడు నా క్లిష్ట సమస్యలు సమసిపోయి నా హృదయం ఆనందోద్వేగంతో ఉరకలు వేస్తుంది. ఏమిటో యీ వింత! నీకేమైనా తెలిస్తే చెప్తావా? నీ

సుధాకర్

కల్యాణి,

త్వరలోనే వస్తాను. నీ యింటికే వస్తాను. కవాటాలుతెరచి ఉంచుతావుగదూ! మీ అన్నయ్య, కాదు నా క్లాస్‌మేట్, డియరెస్ట్ ఫ్రెండ్ నీకు తెలుసో తెలియదో ఆ విషయం. రవిని కలుసుకుంటాను. మన ప్రేమి చేస్తాడో తెలుసుకుంటాను. తర్వాత నిన్ను కలుస్తాను. అప్పుడే అన్ని విషయాలూ మాట్లాడుకుందాము.

చాలా పెద్ద ప్రశ్నే అడిగావే!" వివాహమంటే ఏమిటా?" ఎక్కువగా నాకు మాత్రమేం తెలుసు. నాకు తెలిసినదల్లా యుక్త వయస్కులయిన ఒక అమ్మాయిని అబ్బాయిని కలకాలం బంధించే జీవిత బంధం. జీవితానికి శోభను, సంపూర్ణతను కూర్చే ఆనందం. నీతిని భద్రంచేసి మోహాన్ని పునీతంచేసే ఏకైక తపో ఆరంభం. అతి సుందరంగా అలంకరించబడిన వివాహ వేదికపై మంగళ వాద్యాలు మ్రోగుతుంటే సుమంగళివికాగా మనం పెళ్ళికి సంతానమవుతాం.

ఆరోజు నేను నీదగ్గరకు వస్తాను. నీవూ నా దగ్గరకు—చాల దగ్గరకు వస్తావు. దూరాన్ని విరహాంపాలుజేసి. ఏవేవో తెస్తావు, సిగ్గు బిడియాలమధ్య సతమతమవుతూనే అన్నీ నా కిస్తావు. నేను మైమరిస్తే నువ్వు మురుస్తావు. ఆనందోద్వేగంతో నేను ప్రణయాల కబుర్లు చెప్తుంటే నువ్వు ఊకొడతావు హృదయంలో. నిత్యము తెల్లని నవ్వులతో మల్లెలు పూయిస్తూ నా కనుల ముందర సంచరిస్తావు. అహర్నిశలూ, జీవితాంతం నీ చల్లని నీడలోవిశ్రమించి లోకాన్నే విస్మరిస్తాను నేను. 'అమ్మో' వూహించేకొద్దీ హృదయం తేలికైపోతూంది. అలాగే ఆకాశంపై విహరించనిస్తే ఎలా నాకు? చిక్కవేమో? ఇక ఉంటాను. నీకలవరం దూరమవుతుందిలే. ఏమంటావ్. ఆనమంటావ్.లేదంటే నవ్వుకుంటూ ఉంటావ్.. టా. టా. అన్నట్టు మరచాను. మీ అన్నయ్యన్న డా. రవి ఎమ్. బి. బి. ఎస్. ప్రాక్టీసు ఎలా ఉందో తెలుపుతావుగా! సుధాకర్.

*     *     *

అన్నీ చదివి తృప్తిగా నిట్టూర్చింది కల్యాణి. ఒక గంభీరమూర్తి, మధురస్ఫూర్తి తన ప్రియుడు! ఇలా యీ ఉత్తరాలు చదవటమెన్నోసారో! ఇన్నాళ్ళూ ఎంతోదూరాన ఉండి తనను గారడి చేసిన సుధాకర్ మధురాకారం తనకు ఎంతో దగ్గరవుతుంది. అసలు దూరమే మిగలనంతగా దగ్గరగా వస్తుందనే భావం ఆమెను తెలియని సంతోషంలో తేలేట్లు చేసింది. గది గోడలపై ఎన్నో చిత్రాలు విరహోద్వేగంతో పెనవేసుకున్న ప్రణయ జీవుల అనురాగాల ఆలింగనాలు ఆమె ఆశాపూరిత నేత్రాలను నిలువరించాయి! రాబోయే అవకాశంలోనికి జారుతున్నాయి ఆమెలోని ఆశ లేవో. యేవేవో తీయని వూహాలు హాయిగా జోకొడుతుంటే మెత్తని స్పర్శలతో నిద్రలోనికి జారింది కల్యాణి.

*     *     *

అనుకున్న ఆతృతతో ఎదురుచూచే ఆ క్షణం రానే వచ్చింది. సుధాకర్ వచ్చాడు. వేరే ఎవరో నూతన వ్యక్తి ఉన్నాడతని ప్రక్కన. ఆనాడు పెండ్లిలోనూ ఆయిద్దరినీ ఒకచోట ఉండగా చూచింది. ఇద్దరికీ అంత విడరాని స్నేహమేమో అనుకుంది.

"అప్పుడూ యిప్పుడూ అదే చూపు. అదే తన పాలిట సమ్మోహనాస్త్రమైంది. అతని సౌందర్యం అపురూపం" అనుకుంది రెండవసారి. "వెంబడే వెంబడేఉన్న ఆ యిద్దరికీ ఎంత అంతరం" అనుకుంది కల్యాణి.

ఆరోజు సాయంత్రం కల్యాణి తన అన్న రమేష్‌తో మాట్లాడి వస్తుంటే సుధాకర్‌తో ఉన్న ఆ రెండో ఆయన ఎదురయ్యాడు. ఆమెవైపే చనువుగా చూస్తూ. అతని వాలకం ఆమెకు అసహ్యమనిపించి, అతన్ని తప్పుకుని ముందు కడుగు వేసింది.

"కల్యాణి" పిలిచాడతను!

ఆమె ఆగింది. లీలగా విలాసంగా కదిలే నల్లని పొడవైన జడ నర్తించడం మానింది కాసేపు. అంతకంటె అతనేమీ మాట్లాడలేదు. అతను మాట్లాడేదాకా నిల్చునే వోపిక ఆమెకు లేదు. ఆమె నిర్లక్ష్యంగా, అతనివైపైనా చూడకుండా సాగిపోయింది!



# అతనిలోని మనిషి

ఉదయం పది గంటలకే సుధాకర్ వచ్చినా కల్యాణికి మాట్లాడేందుకు వీలు కలుగలేదు. సాయంత్రం ఐదు గంటలదాకా రవితోనే యేవేవో మాట్లాడుతూ ఉన్నాడు. "అన్నయ్యతో యేమి మాట్లాడుతున్నాడా? తమ ప్రేమ విషయం చేప్తాడో? మీ చెల్లెల్ని నా కిచ్చి వివాహం చేస్తావా! అని అడుగుతాడా? ఏమో అతను కనపడితేనేగాని తెలియదు" ఇలాటి ఆలోచనలతోనే ఆవేళ దాకా గడిపింది. ఐదు గంటల సమయమప్పుడు రవి గదినించి వస్తున్నాడు. కల్యాణి వరండాలో గులాబి పొద వెంబడే నిల్చుని ఉంది. "సుధాకర్ వస్తున్నాడు. ఇటే వస్తున్నాడు. ఇప్పుడు తన దగ్గరికే వస్తాడు. అన్నయ్య నిర్ణయ మేదో చెప్తాడు!" ఏదో కలవరంతో సతమతమవుతుంది కల్యాణి మనసు.

ఉత్తరాల ద్వారా హృదయాలు చదువుకున్నారు. పరస్పరం త్వరగా దగ్గర కావాలనుకున్నారు. ఆ క్షణం దాకా ఆలస్యం భరించలేకపోయారు. తీరా, దేహాలు దగ్గర కాబోతున్నాయి. మనోవీణ మూగపోయింది! తనువులో యేదో వణుకు ప్రారంభమయింది. కల్యాణి వెనకనించి వచ్చే సుధాకర్‌వైపు తిరగ సాహసించలేకపోయింది! 'అతను తనకు దగ్గరగా వచ్చి ఉంటా డీపాటికి. తన వెనక నిల్చి తననే గ్రుచ్చి గ్రుచ్చి చూస్తుంటా'డని పించిం దామెకు.

ఆమె ప్రత్యణువు ఏదో వింతైన పులకింతతో గగుర్పొడిచింది! ప్రేమ తలపుల లోని పులకింతలతో ఎన్నెన్నో మాట్లాడాలనుకున్నా హృదయానికి అప్పుడు మాటలే దొరకలేదు. పైగా శరీరాలు దూరమైతే బాగుణ్ను అని గూడా అన్పిస్తుందంటే ఆశ్చర్యమే మరి! అయినా అడుగు కదలలేదు! ఏమిటీ వింత అవస్థ!

ఎంతసేపలాబొమ్మలా నిలబడటం? ఎంతకూ పలకరించడేం? విలంబనాన్ని సహించ లేకపోయిందామె. ఎలాగో ఓపికచేసి, వూపిరి బిగబట్టి, ఓరగా వెనుదిరిగి చూచింది! ఆమె ఆశ్చర్యాని కంతులేకపోయింది!!!

తనుబేలైనా అతను పురుషుడు. ఏవో మాటలతో చనువుగా దరికి చేరతాడనీ, దగ్గరకు తీసుకుంటాడనీ వూహించిందామె.

కాని సుధాకర్ అక్కడలేడు!!

'ఎక్కడికిపోయాడు? ఎందుకుపోయాడు? తనక్కడున్నట్టు అతనికి తెలియదా? అదేలా! తనని చూస్తూనేగా వస్తున్నాడు. పైగా అడ్డమేముంది యిద్దరిమధ్య. మరి, తనను చూచి కూడా పల్కరించకుండా ఎందుకు పోయాడు? అంత పిరికివాడా? కాదు. కానే కాదు. సర్వ లక్షణ సమన్వితుడైన పురుషుడతడు!'

"బహుశా, ఎవరైనావస్తుంటే యిది సమయంకాదని వెళ్లిపోయిఉంటాడు" అని సరిపెట్టుకుంది కల్యాణి.

ఇంతలో ఆ రెండో అయన యిటే వస్తుంటే త్వరత్వరగా వెళ్లిపోయింది తన గదిలోనికి.

"తన పరిస్థితి యిలా అయిందేం? ఎంతసేపు నిలబడిం దక్కడ తను? సుధాకర్ ఉనికిని గ్రహించింది. అదే తనను మంత్రించింది! ఇక కదలలేకపోయింది! అయినా సుధాకర్ ఎందుకు పల్కరించలేదు? తనపై కోపమా? తనంత పొరపాటేమి చేసింది? అతను తన యింటికి వచ్చాడు. ముందుగా పల్కరించవలసిన ధర్మం తనది. కాగా, ఉదయం చూసీ, మౌనం వహించింది. ఇప్పటివరకూ ఒక్కమారైనా మాట్లాడలేదు. ఇప్పుడు ఎదురయినా పెడ మొగమైంది. అతనేమనుకున్నాడో? కనీసం ఎప్పుడొచ్చారు? అనైనా అడగాల్సింది. అయినా వాగ్వాణి కల్యాణి అని స్నేహితుల చేత పిలువబడే తను మూగదయిందేం ఉదయంనించీ.

'ఏమైనా వెంటనే ఆయన్ను కలుసుకుని పల్కరించాలి' అని నిర్ణయించుకుందామె. భోజనాలయిన తర్వాత పది గంటలకల్లా ఎవరి గదుల్లోవారు చేరారు. కల్యాణికి ఒకటే తొందర. ఎప్పుడెప్పుడు సుధాకర్‌వద్దకు పోనా?అని. వెంటనే ఏమనిపోనా? ఎలాపోనా? అనే సంకోచం.

ఆఖరికి ఎదురుతిరిగే ఎడదను అదిమిపట్టి అతని గదిలో ప్రవేశించింది. లైటు వెలుగుతూనేఉంది. అతను నిద్రపోతున్నాడు! అప్పుడే నిద్ర ఎలా పట్టిందా అనుకుంది. తనివితీర అతని అందాన్ని, ముఖ వర్చస్సులోని నిశ్చలతను చూచింది. అలా అతని మనోహరమైనసుందరమూర్తిని చూస్తుంటే, ఆమెలోని వణుకు, బిడియాలు తగ్గాయి. జన్మ జన్మల ఆత్మీయతా భావమేదో ఆమెలో ఏదో చనువును, తెగువను కలుగజేశాయి. కావాలని గాజుల చేతిని కదిలించింది. అంతమాత్రాన్నే అతను ఉలిక్కిపడిలేచాడు. అతనివైపే చూస్తూ నిలిచింది కల్యాణి. అతనూ ఆమెవైపు చూశాడు.

వెంటనే ప్రక్కమీదనుంచి లేచాడు. ఆమెను పల్కరించలేదు. ఆమెవైపే బెరుకు బెరుకుగా చూస్తూ, వాకిలివద్ద నిల్చిన ఆమెను తొలగిస్తున్నా చెప్పకుండా ఒదిగి ఒదిగి బైటికి వెళిపోయాడు, ఆమె యేదో మాట్లాడాలనుకునేలోపునే.

ఆ సంఘటన తాలూకు సంభ్రమాన్నించి తేరుకునేలోపునే ప్రక్కగదిలోంచి సుధాకర్ స్నేహితుడు లేచివచ్చాడు. —

'అరే! మీరేనా!! ఏమిటో అనుకున్నాను. ఏమి జరిగింది?' అన్నాడు.

తోడిపిల్లలచేత దెబ్బలుతిని తండ్రితోనో తల్లితోనో మొర పెట్టేముందు వారిని పొట్లాటకుపంపి, వారివెనకవచ్చే పసిబాలునిలా అతని వెనకేవచ్చి నిల్చున్నాడు సుధాకర్. అంతలో రవి కూడా వచ్చాడు.

'ఏరా, సుధా. ఏమిటి విషయ'మంటూ.

"ఆ. ఏమీలేదు. మన కుమార్ వణుకుతూ వచ్చాడు నా గదిలోనికి. ఎప్పుడూ నన్ను వదలినవాడుకాదుగా. ఒంటరిగా భయపడి ఉంటాడని నా ప్రక్క చోటిచ్చి పడుకోమన్నాను. పడుకోకుండానే యీ గదివైపు సైగచేసి చూపించాడు. ఏమిటో జరిగి ఉంటుందని వచ్చి చూస్తే కల్యాణి ఉందిక్కడ" అన్నాడు సుధాకర్.

'సుధాకర్!—కుమార్!!' ఎవరు సుధాకర్? ఎవరు కుమార్? ఏమిటీ విపరీతం?

"ఇన్నాళ్ళ తను హృదయాధిదేవుడైన సుందరమూర్తి సుధాకర్ కాదా? ఇతడా సుధాకర" కల్యాణి తల తిరిగింది.

"వెళ్లాయ్. వాడిగదిలో కెందుకొచ్చావ్? మాట్లాడలేదు. అంతకంటె పిరికివాడు. ఏరా కుమార్! భయపడ్డావా? మన కల్యాణేగా అతనివీపు తట్టుతూ రవి అనే మాట." ఆమెకు వినిపించాయి.

కల్యాణి యేమీ మాట్లాడలేదు. యే జవాబూ చెప్పలేదు. ఎవరివైపూ కన్నెత్తయినా చూడలేదు. బిరబిరా తన గదిలోనికి నడచిపోయింది.

ఆమెకు లోకమంతా గిర్రున తిరుగుతున్నట్లయింది. ఎంతో ఎత్తున నిర్మించుకున్న ఆశాహర్మ్యాలు ఒక్కసారిగా పాతాళానికి క్రుంగి, భంగపడిన ఆమె హృదయం దిగజారి విలవిల్లాడింది. తన మనసు హరించిన సుందరమూర్తి బడుడు! మూగవాడు!! పిరికివాడు!!!

తను ఆరాధించుకున్న వ్యక్తి ప్రణయ భావాలతో నూతన భాషనే సృష్టించగల మేధామూర్తి సుధాకర్!!

ఎలా సంభవమైనా యీ దుర్ఘటనకు తను తట్టుకోలేదు. ఆమె ఎటో శూన్యంలోకి చూస్తూ ఉండిపోయింది కాసేపు. ఆఖరికి ఆమెలో చెలరేగే ఆందోళనా ఉధృతంలో ఏమిటో నిర్ణయించుకుంది.

"అన్నయ్యా.

నేనెందు కీ పని చేస్తున్నానో నాకే తెలియదు. దానికి సరైన హేతువును విశదం చేసేంత ఆలోచనా శక్తి లేదిప్పుడు నాలో. కాని చేయక తప్పదు. ఎవ్వరూ చూడనియే దూర తీరాలకో చేరాలనుకున్నాను. చిన్నప్పుడే తల్లిని దండ్రిని పోగొట్టుకున్న దురదృష్టవతిని నేను. అయినా తల్లి, తండ్రీ అన్నీ నీవై పెంచావు. నా సుఖం చూడాలని ఆశించావు. దురదృష్టవతిని నేను. నీ అనుమతి లేకుండానే యీపని చేస్తున్నాను. ఉన్నాడనుకుని లేని వ్యక్తిని వెదుక్కుంటూ వేరే లోకానికే ప్రయాణమౌతున్నాను. నన్ను క్షమించనయ్యా.

నీ అభాగ్యపు చెల్లెలు
కల్యాణి."

ఆ కాగితాన్నక్కడే టేబిలుపై నుంచి, లేచి అన్నయ్య మందులుంచే గదిలోనించి ఒక సీసా తెచ్చి దానిలోనున్న దేదో నోట్లో వేసుకోబోయే సమయంలో సీసా ఆమె చేతుల్నించి విడిపడి అల్లంత దూరాన పడింది.

అతను! తనవాడుకాని సుధాకర్ నిశ్చలంగా నిలబడి ఉన్నాడు!

ఆమె వ్రాసిన కాగితం అతని చేతులో ఉంది.

"విషం తిని చనిపోవాలనుకున్నావా, కల్యాణీ" అన్నా డతను ఆమె కళ్లలోనికే సూటిగా చూస్తూ. ఆమె యేమీ పలుకలేదు. తలవంచుకుంది. "ఎందుకీ పని చేయ నిశ్చయించుకున్నావు?"

ఈసారీ ఆమె మౌనమే సమాధానమైంది.

"సరే. కల్యాణి. నేను చెప్తాను. నీవెందుకు ప్రాణత్యాగం చేయాలనుకున్నావో! ఆశాభంగం తీవ్రత యిది. ఆనాడు నువ్వు చూచినది, ప్రేమించినది కుమార్‌ని. అంటే కేవలం నీ కన్నులలోనింపి, నిన్నాకర్షించిన అతని చక్కని బాహ్యాకృతిని మాత్రమే. అలాగే నానుంచి వచ్చిన ఉత్తరాలు నిన్ను నాతో ఒకవిధంగా బలంగానే బంధించాయి. కాని, యీనాడు అసలు నిజమేమిటో తెలిసింది. నీవు వలచిన అందం అతనిలో లేక అతన్ని ప్రేమించలేకపోయావు. ఇక నాతో ఉత్తరాల ద్వారా ఏర్పడిన ఈ అనుబంధాన్ని త్రెంచుకోవడానికి ప్రాణత్యాగమే ఏకైకమార్గంగా తోచింది నీకు.

ఇంత అనర్థానికి కారణం ఆనాడు పెండ్లిలో మమ్మల్నిద్దర్నీ ఒకరి వెంబడి ఒకరుండగా సావిత్రి మాట్లాడ్డం చూచావు. సావిత్రిని అడిగావు అత నెవరని? కుమార్‌ని ఉద్దేశ్యంలో పెట్టుకుని. సావిత్రికి తెలుసు కుమార్ సంగతి. పైగా చిన్నప్పట్నించి












# జామా నివారిస్తుంది

తలనొప్పి, దగ్గు, జలుబు. ఎక్కడ బాధగా వుంటే అక్కడ జామా రబ్ రుద్దండి. వెంటనే మీకు ఉపశమనం కలుగుతుంది. మెంథాల్, ఉపశమనం చేకూర్చే తదితర ఓషధులు కలిగి వున్నందున జామా వెంటనే పనిచేస్తుంది. వొంటినొప్పులనుకూడా జామా రబ్ తగ్గిస్తుంది. జలుబుచేసి ముక్కు దిబ్బడి వేసినప్పుడు జామా ఇన్‌హేలర్‌ను పీల్చడంకంటే మించిన ఉపశమన మార్గంలేదు. వెంటనే గుణమిచ్చి. ఉచ్ఛ్వాస నిశ్వాసలకు వీలుగా సడలిస్తుంది.

లక్ష్మీ మార్కు జామా ఆయిల్ ఉత్పత్తిదారులే తయారుచేసినవి.

అమర్‌చంద్ శోభాచంద్
95, నైనప్పనాయక్ వీధి, మద్రాసు-3.



ఆమె నాలోని వ్యక్తినే చూచింది. అందుకే నన్ను గురించే అడిగావేమోనని అపోహ పడింది. కనీసం కుమార్ విషయం నీకు తెలియదని సావిత్రికి తెలిసినా యీ అనర్థం జరక్కపోయి ఉండేది. మాపినతల్లి కుమారుడు కుమార్. చిన్నప్పట్నించి యిలాగే ఉండేవాడు. ఎక్కడున్నా నన్ను వదలి ఉండలేడు. జరిగిందేదో జరిగింది. అయినా పర్వాలేదు. మనకు హృదయాలున్నాయి. స్వేచ్ఛగా మాట్లాడుకోగలం యిప్పుడు.

కల్యాణీ, జీవితం చాల విశాలమైంది. ఎన్నో విచిత్రాల్ని, విషాదాల్ని ఎదుర్కోవాలి. ప్రతి విషయాన్ని సీరియస్‌గా తీసుకోవడం, కించపడి నిస్పృహ చెందటం అంత మంచిదికాదు. ఒక చిన్న సంఘటన జరిగింది. ఆ జరిగిన సంఘటనా లేశానికి యింత విలువైన జీవితాన్ని బలి తీసుకునే శక్తిని కల్పించవచ్చా? లోకంలో హృదయాన్ని చూసే హృదయం యింతగా బాధపడుతుంది. నా గురించేకదా నీవు భయపడ్డావు. కనీసం నా హృదయ రీత్యైనా నీ కర్థమయి ఉంటుందనుకుంటాను. ఇప్పుడుచెప్తాను, మరలా 'నువ్వు తీరిన కామితాలతో నూరేళ్లు జీవించాలి హాయిగా' అదే నా హృదయ గత వాంఛ. నాలో నీపట్ల ఉన్న అనురాగంలో గల అర్థం."

"మీలో నేనే ఆశలు రేపాను. ఇప్పుడు మీ జీవితంలో తీరని దుఃఖాన్ని కలుగజేశాను. రమ్మని యింటికి పిలిచి అవమానించాను" అంది కల్యాణి తలవంచుకుని.

"ఆశ—నిరాశ, కష్టం—సుఖం, చీకటి—వెలుగులు అతి సహజాలు, అత్యంతసామీప్యాలూ మానవ జీవితానికి అనే విషయం నాకు యిలాంటి సమయాల్లో జ్ఞప్తికి వస్తుంది. కల్యాణీ! లోకంలో తనదికాని దానికోసం కాదాని దానికోసం మానవుడు విచారించరాదు. కొన్ని దినాలు నాలోని ఆనందం నిదురలేచి ఎదురులేని విధంగా స్వైర విహారం చేసింది. కేవలం ఆ భావానికే తగిలింది, ఏ దెబ్బయినా తగిలితే."

"మీకు నిజంగా యే బాధా లేదా?" అమాయకంగానే అడిగింది కల్యాణి.

"నిజం చెప్పమంటావా కల్యాణీ! ఎన్ని భావనా లోకాలలో ఎంతకాలం విహరించినా యే విధమైన నష్టము ఉండదు. కాని, ఊరకలు వేసే హృదయానికి లక్ష్యంగా ఒక సజీవ మూర్తి నిల్చి, ఆ మూర్తినే తనదిగా ఎంచి, ఆశలు పెంచి, అనురాగాన్నాశించే హృదయానికి, అది విఫలమైననాడు కలిగే వేదన తక్కువైనదేమీకాదు. ఎంత నిగ్రహమున్నా తడబాట్లు తప్పవు. హృదయమున్న మానవునికెవనికైనా. అయినా యీ లోకంలో ఒక్క ఆనందమేకాదు. విషాదం. కాఠిన్యం కూడా ఉన్నాయని తెలుసు నాకు, కాని, కల్యాణి, సామాన్య వ్యక్తిగా యెన్ని అవమానాల్నయినా సహించగలను నేను. కాని నాలోని వ్యక్తి విశిష్టమూర్తి, కళా తపస్వి. అందరికంటె అధికుడు. ఏ లోపమూలేని ఆ వ్యక్తికి కళంకాన్ని, అపజయాన్ని కలుగజేయలేను. నాలోని ఆ సౌందర్యమూర్తికి నా శాయ శక్తులా జయాన్నే లభింపజేస్తాను. ఆ వ్యక్తే మీకు నా ఉత్తరాల్లో కనిపించాడు కొంతవరకూ. మీ ప్రేమను కోరాడు. ఆ వ్యక్తి. అదే నన్ను బాధించేది" అని కాసేపాగి కల్యాణినే పరిశీలిస్తూ "కల్యాణీ, కనీసం ఆ వ్యక్తికోసమైనా నన్ను ప్రేమించలేవా?" అన్నాడు ఆశానేత్రాలతో.

# అతనిలోనిమనిషి

"క్షమించండి. అడిగారు గాబట్టి నిజమే చెప్తాను. మీరంటే నా కెంతో గౌరవం, అభిమానం ఉన్నాయి. మీరు నా హృదయంలో మరపురాని మనిషిగా, జీవితాంతం నిలిచిపోతారు. కాని ఎందుకో మిమ్మల్ని ఆ దృష్టిలో చూడలేకపోతున్నాను"

"చూచావా కల్యాణీ. మీనుంచి యిలాంటి జవాబేదో వస్తుందని తెలుసు. కాని నాలోని ఆశాలేశాన్ని చంపుకోలేకపోయాను. అందుకేనేమో మానవు డెప్పుడూ సంపూర్ణుడు కాలేడు. కేవలం ఆశాజీవియైన మానవుడు తనలో కొంత స్వార్థాన్ని మిగుల్చుకోక తప్పదు, తన జీవితాన్నానందమయం చేసుకునేందుకు. ఆ స్వార్థ లేశమే నన్నింత వరకూ ఆశా పరిధుల్లో త్రిప్పింది. నాకు పూర్ణమూర్తిత్వముందనే భ్రమ, గర్వాన్ని కొరతలేని తృప్తిని కల్గించిందిన్నాళ్లూ. కాని యీనా సంఘటన నాలో యేదో లోపముందనే కఠిన సత్యాన్ని ఋజువు చేసింది. తెలుసుకున్న తర్వాత కూడా నాలోని ఆలోపం ఎవ్వరికీ ఆటంకం కారాదు. ఆ నా నిర్ణయంలో నా జీవితం ఎడారి అయినా ఫర్వాలేదు."

"మీరు కావాలని బలవంతం చేసి ఉన్నా, నేను వ్రాసిన ఉత్తరాలు అన్నయ్యకు చూపి నన్నుకోరినా తప్పక మిమ్మల్ని వివాహం చేసుకోవలసి వచ్చేదే. కాని మీరు త్యాగమూర్తులు. స్వార్థ ప్రధానమైన యీ లోకంలో మీరు దైవ స్వరూపులు" అంది కల్యాణి.

నిజం చెప్పావు కల్యాణీ. అందుకే నన్నెవరూ అందుకోలేరు కూడా. అయినా కొన్ని పరిస్థితులు— నీవు మామూలు మనిషివే— అనే పరిస్థితులు, తమ ప్రభావాన్నెక్కువ చూపుతుంటాయి నామీద. అయినా ఫర్వాలేదు. ఎడారిలోనించి వీచే గాలిలోనూ యే మూలో తేమ ఉండకపోతుందా?"

కల్యాణి దుఃఖోద్వేగం అణచుకుంటూ అంది: "సుధాకర్‌గారూ నేను కఠినురాల్ని. మిమ్మల్ని నిరాదరణచేసి మీ అమృత హృదయాన్ని బాధించాను."

సుధాకర్ విరక్తిగా నవ్వాడు. "నా దయనీయస్థితికి జాలిపడుతున్నావా? దిగజారే నన్నోదారుస్తున్నావా? వద్దు కల్యాణి! ఆశలెందుకు నా పై జాలి. నేను సౌందర్యహీనుణ్ణనేగా. అహహ! కాదు. కానేకాదు. నేను చాల అందమైనవాణ్ణి. నాలోని ప్రత్యణువ



# అతనిలోని మనిషి

లోను ప్రత్యేక సోయగముంది. నా ప్రతి కదలికలోనూ ప్రత్యేక చెలువం చెలువారుతుంది. నా పలుకులలో సుధాధారలు జాలువారుతాయి. పోతే, ఎవరులేరే తోడూ, నీడా! ఒంటరిగా జీవితాంతం ఎలా ఉండగలడో పాపం! అనేసానుభూతా? నేను ఎవరూ ఎరుగనైనా లేని దివ్యాంగనలతో సాంగత్యం చేయగలను. బ్రహ్మసృష్టిని మించిన కళా వైదుగ్ధ్యంతో ఎందరో సర్వాంగసుందరులను సృష్టించగలను. వారితో మృదు మధురమైన భాషతో ప్రణయ భాషణ చేయగలను.

ఇక నీ హృదయం గాయపడిందిగదా, నీ బ్రతుకు ఎడారి తుల్యమేకదా అంటావా? గాయపడి తీయగా స్పందించలేకపోవచ్చు. బాధగానైనా మూలుగుతుందిగా. హృదయం ఎడారి అయినా నందనమయినా, అమృత సరసి అయినా దానిలో ఉద్భవించే భావాలకు శబ్దరూపముంటుంది. నగ్నజీవిని వలచి దరిద్ర ప్రణయం కోరే ఆర్థికామిని యింకా పరువపు దశలోనే ఉంది! తెరుచుకోని మానవ హృదయ కవాటాల దరినిల్చిన ధర్మం పరగళ్ళు తిరుగుతూ జాలిగా చూస్తూ ఉంది. విజ్ఞానం వక్రాకృతిని దాల్చి పచ్చని ప్రకృతిని వికృతంచేయ ప్రయత్నిస్తుంది. పగటికే తిమిరపు పూతను పూసి నింగిన అశాంతి మేఘాలు దట్టంగా ముసురుతున్నాయి! ఎప్పటినించో నిర్విరామంగా పయనించే కాలం ఒక్క క్షణమైనా ఎక్కడా నిలువకుండా ఉడగని జవ సత్వాలతో ముందుకు సాగుతూనే ఉంది. నా హృదయంలో స్పందన చలనాలున్నాయి. వెన్నెల అమావాస్యల కనుగుణంగా ఆర్ద్రమయిన హృదయంలో జలదరించేందుకు కళ్ళనిండా నీరుంది. నా హృధ్వనిలో విరిసిన సాహిత్య పారిజాతులు యేనాటికీ వాడవు. సౌరభాలు వీడవు. ఇవి చాలు నా జీవితాన్నంతా సంపూర్ణంగా ఆక్రమించి ఆశలు రేపేందుకు. నేను కేవలం అశోపహతుణ్ణిమాత్రమే. నిరాశాజీవినికాను."

అతని మూర్తి ఉత్తేజితమయింది. అతని కనులలో వింత కాంతి వెలిగింది. ముఖంలో నవ్యమైన చైతన్యం వెల్లివిరుస్తుంది. ఎటో ఏ శూన్యంలోకో చూచే అతని గంభీరమూర్తిని చూచిన ఆమె భయపడింది. కాసేపటికి మామూలు స్థితికి వచ్చిన సుధాకర్ ఆమెవైపు అమృతంవర్షించే కళ్ళతో చూస్తూ, "నేనేదేదో అన్నాను. అది కేవలం నాలోపొంగిన ఆవేశ తీవ్రత మాత్రమే. అంతేకాని ఎవరైనా వినాలని అన్నమాటలు కావవి. ప్రేమ యెప్పుడూ ఆనందాన్నే యివ్వాలి. త్యాగఫలితలేశాన్నయినా అది సహించదు. నాపై నీకు అంతులేని అభిమానముంది గదూ? అభిమానం వేరు. ఆనందం వేరు. నీ ఆనందమే, సుఖమే కోరుతున్నాను నేను. నాపై ఉందన్నావే ఆ అనురాగమే, గౌరవమే చాలు నాకు. రేపు మీ అన్నయ్య అడగవచ్చు నీ వివాహ విషయం. నువ్వు నిర్భయంగా నీ మనసులోని మాట చెప్పు. నేనూ చెప్తానులే. చాలా ప్రొద్దుపోయింది. ఇక నేను పోతాను" అన్నాడు పోబోతూ సుధాకర్.

సజలనేత్రాలతో అతన్నే చూస్తూ అంది కల్యాణి. "పోవద్దని వారించలేనుగాని, పవిత్ర భావంతో నా హృదయం కార్చే కన్నీటితో మీ పాద పద్మాల్ని కడగగలను. ఏదీ ఆ అవకాశం కలుగ జేయండి. అప్పుడే నన్ను క్షమించినట్లుగా భావిస్తాను" అతని పాదాలకు నమస్కరించింది కల్యాణి. ఆమె కన్నుల వెంట జారిన కొన్ని కన్నీటి బొట్లు అతని పాదాలపై బడ్డాయి.

ఆమెను లేవనెత్తి, చిరునవ్వుతో ఆమె కళ్ళలో చూస్తూ, "ఏడుస్తున్నావా కల్యాణీ" అన్నాడు.

"మీరు నన్నెందుకు బ్రతికించారు" అంది వెక్కుతూ కల్యాణి.

"సుఖంగా జీవించేందుకు. అన్ని విధాల నీ కనుగుణమైన భర్త లభించాలి నీకు. తిరిగి తీరిన కామితాలతో నూరేళ్లు జీవించాలి. ఇది నా కోర్కె. నా ఆశీర్వాదం. కనీసం నా యీ ఆశీర్వాదానికన్నా విలువ యిస్తేనే నాకు సంతృప్తి" అంటూ కారబోయే ఒక కన్నీటి బొట్టును తుడిచి చిరునవ్వుతో ఆమెను కాసేపు చూచి, వీధ్కాని వెనుదిరిగాడు సుధాకర్.

"ఎక్కడికి పోతున్నారు?" ఎందు కడిగిందో ఆమెకే తెలియదు.

"ఇంతవరకూ నోటివెంట నిరాటంకంగా వెలువడ్డ మాటలవలె క్షణ క్షణం నేనున్నానని హెచ్చరిస్తూ స్పందించే హృదయాన్ని తేలిక" చేయగల చోటేదైనా ఉంటే అక్కడికి. అన్నాడు సుధాకర్.

కల్యాణి యింకేమీ మాట్లాడలేదు.

సుధాకర్ మౌనంగా ఆ చోటు విడిచిపెట్టాడు.

కున్నాడు. ఇంతలో బ్రహ్మాండంగా వర్షం ముంచుకు వచ్చింది. త్వరలో వర్షం వెలుస్తుందన్న ఆశ లేనట్లుగా కురియుడం మొదలెట్టింది.

"ఆ అబ్బాయి జీవితంలోకూడా ఒక రాత్రి ఇలాగే వానాగాలి మొదలెట్టాయి...." అంటూ మొదలెట్టాడు యువకుడు.

"పాపం!తరువాత ఏంచేశాడా అబ్బాయి?" అన్నాడు జానకిరామయ్య పశ్చాత్తాపం చూపెడుతూ.

ఆ రాత్రి వాళ్లఅమ్మ కుర్రాణ్ణి దగ్గరకు తీసుకుని చాలా దుఃఖించింది. వాడి ప్రస్తుత జీవితం, భవిష్యత్తు తలచుకుని బెంబేలు పడిపోయింది. ఎలాగయినా హైస్కూలు చదువు వరకైనా అబ్బేటట్లు చేయాలనుకుంది.

ఆమె పుణ్యమా అన్నట్లు ఆమెఅన్న ఓమారు ఆవూరువచ్చి ఆమెఇంటికి రావడం తటస్థించిదట. స్థితిగతుల్లో భేధంవల్లనూ ఇంకా అనేక కారణాలవల్లనూ ఆయన ఆ ఇంటికి ఎన్నడోకాని వచ్చేవాడుకాడు.వస్తే ఏదో బాధ్యత తగులుకుంటుందని ఆయన భయం. ఆమె అన్నరాకకు ఎంతో సంతోషించి, ఆయన తిరిగా ఉండేవేళ రాముడి విషయం దీనాతిదీనంగా ప్రస్తావించింది. ఉపాధ్యాయ వృత్తిలో కీర్తి ప్రతిష్టలు గడించి, విద్యార్థుల శిక్షణలో ఉద్దండుడని పించుకున్న తనఅన్నకు రాముణ్ణి సక్రమమైన మార్గానికి తీసుకవచ్చి, విద్యాబుద్ధులు గడపడం, దుస్తరం కాదనుకుంది.

"అన్నయ్యా, దారిదప్పివచ్చినా, నా అదృష్టంకొద్దీ వచ్చావు. రాముడు ఎందుకూ పనికిరాకుండా పోతున్నాడు. వాడు అన్యాయమయి పోతాడని నాకు దుగ్ధగా ఉంది. నాచర్మం వలచినీకు చెప్పులు గుట్టిస్తాను. అల్లుణ్ణి తీసుకువెళ్లి, కాస్త అక్షరంముక్క వచ్చేట్లుచెయ్యి..." అంటూ కాళ్ళు పట్టుకుంది.

ఆయనమనసు చలించక — తప్పలేదు. ఇలాంటిమొద్దును చేర్చుకున్నందువల్ల తన కీర్తి ప్రతిష్టలు దెబ్బతింటాయని మొదట్లో సందేహించినా, ఇదీ ఒకందుకు మంచికే ననుకున్నాడు. ఎవ్వరికీ అంకెకు రానివాణ్ణి వంచుకవస్తే ఉపాధ్యాయుడిగా తనకు ఇంకా పేరువస్తుంది. ఇంకా ఎక్కువ మంది ప్రైవేటు విద్యార్థులు చేరతారు...తనపలుకుబడి ఇంకా వృద్ధి అవుతుంది అన్న ఆలోచనలతో "సరేచూస్తా" నని మోహర్నానిగా అన్నాడు.

# మనిషికోరేది మనిషినే

(16వ పేజీ తరువాయి)

ఆమె ఆనందానికి పట్టపగ్గాలు లేవు. అమాయకంగా, ఆవేశ పూరితంగా అన్నను కావలించుకుంది.

అప్పుడప్పుడే ప్రపంచజ్ఞానం కలుగుతోన్న రాముడికి కూడా తాను మేనమామ ఇంట్లో చదువుకోడానికి వెడుతూన్నందుకు సంతోషం కలిగింది. 'తన్నిక ఎవరూ'బండరాముడు' 'మొద్దురాముడూ'అంటూ హేళన చెయ్యరు. తను బాగాచదువుకుని కలెక్టరీ చేస్తాడు,' అంటూ తీయని ఆలోచనలకు లోనయ్యాడు.

కాని తనమామ చదువుచెప్పే పద్ధతులు చాలా చిత్రమయినవని దుర్భరమయినవనీ తెలియడానికి వాడికి ఎంతోకాలము పట్టలేదు.

మేనల్లుడు'వట్టిమొద్దు', 'బండకొయ్య' అనీ, వాడికి మామూలుకంటే తీవ్రతరమయిన పద్ధతులు అవలంబించాలనే, ఆలోచనతో వాడిని చావచిదగ్గొట్టడం మొదలెట్టాడు. ఏవన్నాపాఠం వప్పచెప్పకపోతే గోడకుర్చీ వేయించడం, 'కోదండం' పట్టించడంలాంటి పనులు చేసేవాడు. వాటితో, మామయ్య అన్నా, పాఠం అన్న హడలెత్తిపోయింది రాముడికి. మామయ్య అంటే సింహస్వప్నం అయిపోయ్యాడు. అంతేకాక ఆయన అయిదువేళ్లకూ అయిదు ఉంగరాలు ఉండేవి. వేళ్లు కలిపి ఉంగరాలు దగ్గరకు చేర్చి, చదువుకుండే పిల్లలనెత్తిపై మొట్టికాయలు వేసేవాడు. కొందరికి నెత్తిచిట్లి రక్తం వచ్చేదికూడా. ఇక కోపంవస్తే పేము బెత్తం విరిగిపోవలసిందే! ఆయనకు'ఉంగరాల పంతులని' పేరు పెట్టాడుకూడా.

ఇంత దమన నీతి ఉపయోగించినా, ఆయిన ఇంటినిండా రాత్రింబవళ్లు ప్రైవేటు పిల్లలు చదువుకనివచ్చి పడిగాపుల పడేవాళ్లు. వాళ్లలో చాలమంది అలసటతో నిద్రపోయ్యేవాళ్లు. భయంతో ఎక్కడో నక్కి ఉండేవాళ్లు. అమావాశ్యకో పౌర్ణానికో ఎప్పుడో ఒకమారుగాని పాఠం చెప్పేవాడుకాడు. పిల్లలకు ఆయన అంటే భయం ఉండటంవల్లనూ, పరిక్షలలో ప్రశ్నాపత్రాలు ఏవిధంగానో 'లావాదేవిల' ద్వారా తోటి మేష్టర్లనుండి సంపాయించి ప్యాసుచేయించడంవల్లనూ, ఆయనవద్దకే పిల్లలు ఎక్కువమంది చేరుతుండేవారు.

మామూలుగా డబ్బుయిచ్చి చదువు చెప్పించుకుండే పిల్లలే పిల్లిలా భయపడిపోతోంటే ఇక దండుగ తిండీ అంటూ చదువుకోవడానికి వచ్చిన రాముడివిషయం చెప్పనక్కరలేదు. వాళ్ళే అష్టకష్టాలూ పాడువమ (నష్టం) నూరుమనీ, వాళ్ళ పెట్టమనీ, పురమాయించడంతప్పితే. సానుభూతిగా ప్రేమగా చదువు చెప్పేవాడుకాడు. అన్నం వేళకు పెట్టేవారుకాదు, ఆకలితో నకనకలాడి పోయ్యేవాడు

రాముడి జీవితం ఇలా కత్తిమీద నడచిపోతున్నా, వాడికి వ్యక్తావ్యక్తంగా ఒక ఉపశాంతి కలుగుతూండెది, అదే మావయ్య చిన్న కూతురు సరోజ సాహచర్యం, ఊరడింపు మాటలు. వాడు చావుదెబ్బలు ఎన్ని తిన్నా చివరకూ ఆపిల్లవచ్చి "బావా.... అన్నం తిన్నావా?......" అంటూ అంతరాంతరాలను కదిలించేట్లు ఆప్యాయంగా పిలిస్తే, దివ్యప్రభావం కలిగినట్లు, వాడి బాధంతా మాయామయిపొయ్యేది. ఆమె తనవద్ద కూర్చున్నా, తనను తాకినా వాడికి ఏదో దివ్యానుభూతి, ఉత్సాహం కలిగేది. స్నేహానికై వెతుక్కొంటున్న వాడికండ్లలో మళ్ళా వెలుగు కనుపించేది.

కాని రాముడి మావయ్య వాడు వట్టి మొద్దు అనీ, వాడితో తనకూతురు స్నేహం చెయ్యకూడదనీ. ఆమెను ఎవరో మాంచి ఉద్యోగస్థునికి ఇవ్వదలచుకున్నాడు కాబట్టి, వీళ్ళ సాహచర్యం మొగ్గలోనే తుంచి వేయాలనుకుని, తనకూతుర్ని రాముడి ఛాయలకు పోకుండా చూస్తుండేవాడు. ఎప్పుడైనా వెడితే మందలిస్తూండేవాడు.

ఇలా, స్నేహమూ, సానుభూతి దూరమయ్యాక రాముడికి మిగిలింది తిట్లు, ఉంగరాల మొట్టికాయలూ, గోడకుర్చీలు. దీనితో వాడిజీవితం దుర్భరమయి పోయింది.

ఇక లాభంలేదనుకుని ఒకనాడు ఇంట్లో ఎవరికీ చెప్పకుండా, భైరాగి టిక్కెట్టు మీద తన వూరుచేరుకున్నాడు. కాని అక్కడా తల్లివద్ద వాడికి ఆదరణ లభించిందికాదు. బిడ్డ, మొరకుతనం వల్లనే, ఇలా లేచివస్తున్నాడనుకుని అన్నను ప్రాధేయపడ మళ్లీ అక్కడ దించివచ్చింది. వాడికి మంచి బుద్ధులు రావడానికి వాడి మావయ్య అన్ని అధికారాలు పుచ్చుకుని ఏ శిక్ష అయినా విధించడానికి హక్కు ఉండాలన్న షరతు పెట్టాడు. రాముడితల్లి, ఒకరిద్దరు అన్నలూ 'అలాగే'నని సమ్మతించారు.

దాంతో ఆయన ప్రచండుడయిపోయ్యాడు. 'రాముడు తిరుగుమోతు అయిపోయ్యాడు. రైళ్లలో కూడా తిరుగుతున్నాడన్న నెపంతో

బలరామ్ పెట్టె అందుకుని - హడావిడి పడ్డాడు.

"నాయనా 'వీరచక్ర' గౌరవం పొందిన నీలాంటి ఉత్తమోత్తమమైన పురుషునికి ఈకపోయివాడు' ఎలా క్షమాపణ చెప్పుకుని, నిన్నెలా అభినందించాలో తెలియడంలేదు."

"అలామరీ నొచ్చుకోకు మామయ్యా" అన్నాడు బలరామ్.

"లేదునాయనా లేదు. దయచేసి ఒక పని చేసిపెడతావా?"

బలరామ్ ఏమిటన్నట్లు చూశాడు.

"ఈ వేళ్ళ ఉంగరాలను, నీ బలం, చాతుర్యం ఉపయోగించి తియ్యి నాయనా కొ...... ఆలోచించకు, నామాటవినక పోతే నన్ను చంపుకుతిన్నంత ఒట్టు! అన్నాడు.

బలరామ్‌కు ఆపని చేయక తప్పింది కాదు. ఉంగరాలను జానకిరామయ్య వ్రేళ్ళ నుంచి తీశాడు.

"ఈ ఉంగరాలతోనే, పశ్చాత్తాపయుంగా ఇన్నాళ్ళు బాలురను నెత్తిపైమొట్టి శిక్షించాను. నాబుద్ధిహీనతకు ఎక్కువగా నీవేగురిఅయ్యావు, ఈ ఉంగరాలు ఉపాధ్యాయవృత్తిలో సంపాదం నాకు గౌరవించి తొడిగినవి, నానాటికి విలువలు తెలిసిన నీ వేళ్ళకు ఇప్పుడు తొడుగుతున్నాను

# మనిషికోరేది మనిషినే

నాయనా, కాదనకు......" అంటూవాగడ్డం పట్టుకున్నాడు. బలరామ్ ఒప్పుకోక తప్ప లేదు.

"నీవు చెయ్యబొయ్యే దేశరక్షణా మహాత్కార్యంలో ఇవినీకు దీక్షా కంకణాలు, రక్షాకంకణాలు, వీరకంకణాలు నాహృదయ కంకణాలూనూ........" అంటూ ఆప్యాయంగా కౌగలించుకున్నాడు. ఇంతలో 'కణిల్ల'ని రంకెవేస్తూ, ఢిల్లీ ఎక్స్‌ప్రెస్ వచ్చింది. అక్కడబండి రెండునిముషాలే ఉంటుంది కాబట్టి ప్రయాణికులందరూ హడావిడి పడ్డారు.

బలరామ్ ఒక మిలిటరీ కంపార్ట్‌మెంట్ లోనికి ఎక్కిసామాను సర్దుకునేప్పటికి రెండు నిముషాలటయిమ్ అయిపోయింది.

స్టేషనులో ఇంకా వర్షం పడుతూనే ఉంది. జానకిరామయ్యచేతిలో బలరామ్ చెయ్యింకా ఉంది. ఇద్దరూ ఏదోవిషయ యమై ప్రస్తావించడానికి ఆలోచిస్తున్నారు.

కాని గార్డ్ విజిలిచ్చి పచ్చదీపం చూపడంతో 'కణిల'ని మళ్లారంకెవేసి బండి బయలుదేరింది. బలరామ్ వెంటనే....

"మామయ్యా......సరో....."

"సరో......" జానకిరామయ్య కూడా ఆపేరునే అప్పుడే ప్రహ నింపడంతో మాట వెంటబడేటి అశబ్దం ఎక్స్‌ప్రెస్ చేసే రొదలో కలిసిపోయింది.

రైలుబండి వెనకపెట్టె ఎర్రదీపం తనకంటి పాపలోంచి కదిలిపొయ్యేంత వరకూ అలానే చూస్తూండి పొయ్యాడు జానకిరామయ్య.

వెనక్కుతిరిగి వేరొక ప్రపంచంలో పడ్డ జానకిరామయ్య మానవెలిసిపోయినట్లు గమనించాడు.

ఏసంబంధమూ ఇంతవరకూ కుదరని కూతురు సరోజని బలరామ్ యుద్ధంలో విజయుడై తిరిగివస్తేమాత్రం తప్ప కుండా ఇచ్చి వివాహం చెయ్యాలనుకున్నాడు.

"తనదెంతమంచి ఆలోచన!..." అంటూ ఎంతో తృప్తిపడ్డాడు.

కాని... ఆయన అంతర్యంలో నిజంగా బలరామ్ తిరిగి వస్తే సరోజని అతని చేతుల్లో పెట్టాలని ఉందా? లేదని ఎందుకు అనుకోవాలి? ఆయనలోని మార్పు స్పష్టంగా కనుపించడంలేదా?

కాని తేజోమూర్తి, సహస్రకిరణుడు, లోకబాంధవుడూ అని సూర్య భగవానుణ్ణి మనిషి ఆనాడెన్నాడుకాని కౌగలించుకోగలడా!

మనిషి కోరేది మహాపురుషుణ్ణా! లేక మనిషినా? ●

## సమాజము, రాజనీతి, ఉదారవాదము

(ఒక పరిశీలన)

రచయిత: శ్రీ చెస్టర్ బౌల్సు, అనువాదం: 'హాణి కుమార' డెమ్మీసైజు 438 పుటలు. వెల. ఆరు రూపాయలు. ప్రకాశకులు ఎమ్. శేషాచలం అండ్ కో మద్రాసు, మచిలీపట్టణం, సికిందరాబాదు.

రాజకీయవేత్త, పారిశ్రామికవేత్త, ఆర్థిక నిపుణుడూ అయిన శ్రీ చెస్టర్ బౌల్సు యిచ్చిన ఉపన్యాసాల యొక్కయూ, వ్యాసాల యొక్కయూ సారం ఈ గ్రంథరూపంగా ఏర్పడింది. ఇందులో 14 ప్రకరణాలలో వరుసగా చరిత్రగతిని మార్చడానికి అమెరికాకు వుండే అవకాశం, అవసరమైన కార్యక్రమం, తగినవర్ధి నిష్పత్తిని నివారించే సాధనం, ప్రజాశక్తి, భావసంపద, యథార్థాలను గమనించడం, యూరపులో అమెరికా రష్యాల లక్ష్యాలు, క్రొత్త విధానం, సమయం, అమెరికా నిర్ణయాలు, ఐక్యరాజ్యసమితి, వేరుపాటు వాదులు, విప్లవం, నవరాజనీతి—అనే విషయాలను గూర్చి "మన ప్రపంచలక్ష్యాలు" అనే మొదటి భాగంలో ఉన్నాయి. 'ఆర్థిక సహాయం—సాధ్యత' అనే రెండోభాగంలో అమెరికా ప్రపంచానికి వివిధ రంగాలలో చేసే సహాయాన్ని గురించి వివరంగా చెప్పబడినది. మూడవభాగంలో 'అభివృద్ధి చెందుతూ వున్న ఖండాలను గురించిన వివరాలు ఉన్నవి. నాల్గవ విభాగంలో కమ్యూనిస్టు సవాలునుగురించి విపులంగా చర్చించబడినది. ఈ విషయాలన్నీ 'అమెరికా సంయుక్త రాష్ట్రాలు—ప్రపంచవిస్తరం' అనే ప్రథమ ఖండానికి సంబంధించినవి.

'అమెరికా కలల సాకారావడం' అనే రెండవ ఖండంలో మూడు విభాగాలున్నాయి. మొదటి విభాగంలో సంపన్న సమాజం యెలాంటి లక్ష్యాలను సాధించాలో, దేశంలో శాంతిని కలిగించి ప్రజాసామాన్యానికి ఉపాధియెలా చేకూర్చాలో, అమెరికా సరకాలో పోటీ, ఆర్థికాభివృద్ధి యెలా జరుగుతుందో అలాంటి విషయాలున్నాయి. రెండో విభాగంలో రాష్ట్ర ప్రభుత్వాలు, గవర్నర్లు, పాఠశాలలు, గృహవసతి, వైద్యసహాయం, మొదలైనవి కలవు. మూడవ విభాగంలో స్వాతంత్ర్యం, పలన వస్త్రేవారిపట్ల అవలంభించే నూతన విధానం, నీగ్రోలహక్కులు, గాంధీజీ ఒక్క నీగ్రోలు ఏర్పాటుచేసిన విశేషాలు, నైతికసాగర ముస్సుగు వాటినిగురించి వున్నవి.

ఇందులోని విషయం ప్రధానంగా అమెరికాకు సంబంధించినదే అయినా ప్రసంగం యూవత్తూ స్పృశించబడే ఉన్నది. విదేశమైనా తన సమస్యలను తీర్చుకొని ప్రగతిమార్గంలో పురోగమించాలంటే యీ విషయాలను తెలుసుకోవడం అవసరం. ముఖ్యంగా భారతీయులకు ఎంతో ఉపయోగకరం. దీన్ని తెలుగు లోకి అనువాదం చేయించి ప్రకటించిన శ్రీ శేషాచలం కంపెనీవారు ఆంధ్రుల ప్రశంసకు పాత్రులు.

—అంగిరస

## హిమాలయ వీరులు:

రచన: మల్లెగుంట రాధాకృష్ణ. ప్రచురణ: సరిమళ ప్రచురణలు, విజయవాడ—3. పేజీలు: 120. వెల: రు. 2—00. (పాకెట్ సైజు. రు. 1—25 పైసలు.)

1962 వ సంవత్సరంలో చైనీయులు మంచుమల గుండెలపై మంటలు రేపిన సమయంలో భారత ప్రభుత్వం పంచశీలను నమ్మి యుద్ధానికి సిద్ధంగా లేని కారణంచేత, అనేక వేలమంది భారతీయ సైనికులు వీర మరణం పొందవలసి వచ్చింది. ఆయుధాలు అందుబాటులో వున్నా లేకపోయినా వెనుకనుంచి తగినంత బలం తమకు వస్తున్నదని వార్త చేరినా చేరకపోయినా, శత్రువుల గుళ్ళవర్షం నుండి తప్పించుకొంటూ, తమ స్థావరాన్ని తాము కాపాడుకొంటూ, స్వధర్మ నిరతితో, మాతృభూమి సేవలో ఆ జవానులు తమ ప్రాణాలను త్యాగంచేశారు. మనకోసం, ఇళ్ళలో పట్టుపరుపులపై పవళించి సుఖాల కలలు కనేవారికోసం ఆ అమరులు, తమ ఆలుబిడ్డలకు దూరమైనారు. త్రికాలములయందు వారు మనకు స్మరణీయులు. వారికై మనమేమిచేసినా, ఆ త్యాగధనుల ఋణాన్ని తీర్చుకోలేము. శ్రీ మల్లెగుంట రాధాకృష్ణ వ్రాసి ప్రచురించిన ఈ పుస్తకం చైనా దురాక్రమణదారులతోపోరాడిన భారత సైనిక యోధుల వీర గాథల సంకలనం. పాకిస్థానుతో యుద్ధంలోవున్న ఈసమయంలో చైనా—పాకిస్థాన్ ఇండోనేసియా కూటమి కుటిల రాజనీతితో దక్షిణాసియా సంక్షుభితమౌతున్న ఈ తరుణంలో, హిమాలయ వీరుల గాథలు పుస్తకరూపంలో రావడం ఎంతో సముచితంగానూ వున్నది. మన యువకుల కర్తవ్యాన్ని నిర్దేశిస్తున్నట్లుగానూ వున్నది. 'వీరపూజ' అన్న మున్నుడిలో "వీర పూజా సమయం ఇది! రండి—మాతృభూమి గౌరవ రక్షణకు దీక్ష వహిద్దాం!! శత్రువులను సరిహద్దు అవతలకు పారద్రోలిందాకా నిద్రపోమని ప్రతిన పూనుకుందాం" అంటూ ఉద్బోధించారు, రచయిత. "సరిహద్దు కథ" లో, భారత చైనాల మధ్య సరిహద్దురేఖ 2400 మైళ్ళ పొడవున, కాశ్మీర్ పంజాబ్, హిమాచల్ ప్రదేశ్, ఉత్తరప్రదేశ్, ఈశాన్య సరిహద్దు ప్రాంతాలను చైనాలోని సింకియాంగ్ టిబెట్ ప్రాంతాలనుండి ఏవిధంగా వేరుపరుస్తున్నదీ, 1959 లో చైనా 50,000 చ. మై. భూభాగాన్ని భారతదేశంలో ఎక్కడెక్కడ ఎట్లా ఆక్రమించుకున్నదీ, అందుకై చైనా చేసిన వితండవాదాలు, ఒక వైపున వాదనలు సాగిస్తూనే మరో వైపున 1962 అక్టోబరు 20 వ తేదీన ఏవిధంగా దాడి ప్రారంభించింది, తిరిగి నవంబరు 20 వ ఏకపక్ష నిర్ణయంగా యుద్ధ విరమణ ఎట్లా చేసింది, ఆ యుద్ధం మూలంగా చైనీయులకు అదనంగా కలిగిన లబ్ధి, అసలు యుద్ధం వారు ఎందుకు చేయవలసి వచ్చింది, మళ్లీ వారికి వారే ఎందుకు శాంతి ప్రతిపాదనలు చేశారు? అన్న వివిధ విషయాలమీద సమగ్రంగా, సంతృప్తికరంగా రచయిత వ్యాఖ్యానాలు చేశారు. అగ్నివర్షంలో శివరాం, నాయక్ మాయారాం, సిపాయి ముఖ్తార్‌సింగ్ ప్రాణాలకు తెగించి పోరాడడం ఈ పుస్తకంలో కళ్ళకు కట్టినట్లు వర్ణించబడింది. 800 మంది చైనీయులను యమలోకానికి పంపిన అహిర్, గూర్ఖా వీరుల సాహస కృత్యాలు మనల్ని జలదరింపజేస్తాయి. గాయాలతోనే విమానాన్ని నడిపిన విలియమ్స్ మన హృదయ ఫలకాలపై శాశ్వతమైన ముద్ర వేస్తాడు. శత్రువులమధ్యలోకి దూకిన సిపాయి సేవక్‌సింగ్, "సాహసి భయపడే చచ్చువాణ్ణికాదు" అనే సింహగర్జన చేసిన బ్రిగేడియర్ హోషియార్‌సింగ్, ధైర్యశాలి ధనసింగ్ థాపా, ప్రాణంపై తీపిలేని హవల్దార్ సరూప్‌సింగ్, 50 మంది శత్రువులను హతమార్చిన జితేందర్‌సింగ్ చౌదరి, మృత్యువంటే భయంలేని బహదూర్‌సింగ్, ఆదర్శ నాయకుడు నాయక్‌మున్షీరాం, కర్తవ్య నిర్వహణలో కన్నుమూసిన ఎన్. జోసెఫ్, యుక్తిపరుడు బదిసింగ్, భీముని మరపించిన జమేదార్ భీముకంగ్, నదిలో విమానాన్ని దింపిన సూర్యకాంత్ ఇట్లా ఎందరో సాహసికుల, దేశభక్తుల, త్యాగధనుల వీరకృత్యాలు ఈ పుస్తకంలో పొందుపరుపబడ్డాయి. రచన సక్రమ పద్ధతిలో సాగింది. మధ్యమధ్య అందమైన బొమ్మలు, అచ్చుతప్పులు చాలా కొద్దిగా ఉండడం ఈ పుస్తకానికి మరికొన్ని ప్రశంసనీయమైన విషయాలు. ముఖపత్రం విషయానికి తగినట్లున్నది. దేశభక్తిగల ప్రతి భారతీయుడూ అవశ్యం చదివి తీరవలసిన పుస్తక మిది.

—శ్రీ రామచంద్రమూర్తి.

## గమ్మత్తుబొమ్మలు

విశాలాంధ్ర పబ్లికేషన్స్. విజయవాడవారు బాల బాలికలకోసం ప్రచురించిన 'గమ్మత్తు బొమ్మలు' మా కార్యాలయం చేరింది. ఇందులో చిన్నపిల్లలకు అత్యంత ప్రీతిపాత్రములైన అయిదు బొమ్మల కథలున్నాయి. చిత్రాలు, మూలం: శ్రీ వి. లొప్పెస్, తెలుగు అనువాదం, శ్రీ ఉప్పల లక్ష్మణరావు. వెల ఒక్క రూపాయి పది పైసలు. వారి ఈ ప్రచురణ బాలలకు ప్రియమైనది.

## అమరజీవి రూజ్వెల్ట్

సైజు: క్రౌన్ 174 పేజీలు. మూలం: శ్రీ వి. యస్. మణియం, తెలుగు అనువాదం: శ్రీ జి. కృష్ణ. ప్రాప్తిస్థానం: యం. శేషాచలం అండ్ కంపెనీ, మద్రాసు, మూల్యం రెండు రూపాయలు.

భారత స్వాతంత్ర్య సమరం పతాకస్థాయి నందుకున్న క్లిష్ట సమయంలో ప్రపంచ నాయకులలో ఒకడైన ఫ్రాంక్లిన్ డి. రూజ్వెల్ట్, భారతదేశం తరఫున వాదించాడు. ఆయన అమెరికా సంయుక్త రాష్ట్రాల అధ్యక్షుడేకాక, ఆర్థికరంగంలో అద్భుతమైన కృషి చేసి ఆదర్శప్రాయుడైన వ్యక్తి. ఆయన జీవిత చరిత్రను, వివరంగా, సరళంగా ఆంధ్రీకరించటంలో అనువాదకర్తలు కృతకృత్యులైనారు. ●



కాంతారావు సింహంతో పోరాడిన యీ దృశ్యం మీరొక చిత్రంలో చూచేవుంటారు

# సినీమాల్లో జంతువులు!

పౌరాణికాలు, జానపదాలు ఎక్కువ సంఖ్యలో తయారవుతున్న ఈ రోజుల్లో సినీమాల్లో జంతువులయొక్క అవసరాన్ని కూడ నిర్లక్ష్యం చేయలేము. గుర్రాలు, ఏనుగులు మొదలైన జంతువులు విరివిగా ఉండే సన్నివేశాలు కొన్ని సినీమాలకు నిజమైన ఆకర్షణను తెచ్చిపెడతాయి.

సినీమాల్లో ముఖ్యంగా ఉపయోగపడే జంతువులు గుర్రాలు, ఏనుగులు, ముంగిసలు, పాములు, కుక్కలు, ఒక్కొక్కప్పుడు సింహాలు, పులులు, ఎలుగుబంట్లు, కోతులు. ఒక్కోసారి యీ జంతువులు చేసే పనులే (పతాక సన్నివేశాల్లో) కొన్ని సినీమాలకు మంచి పట్టునిస్తుంటాయి.

ఏ యే జంతువులు ఎక్కడెక్కడ కావలసింది మన దర్శకులకు చాలమందికి తెలుసు మంచి జానపదం ఒకటి నిర్మాణంలో ఉన్నదంటే డజన్లకొద్దీ గుర్రాలు కావాలి అవసరాన్నిబట్టీ మిగతావి కూడ కావాలి మంచి క్రైమ్ సినీమా తయారవుతుంటే అందంగాఉండే కుక్కలు అవసరం ఇంకా భారీ ఎత్తున జానపదాలు నిర్మించాలనుకున్నవారికి సింహాలు, ఏనుగులు అవసరం

క్రొత్తగా వచ్చే కొందరు నటీ నటులకు శిక్షణ యివ్వడమే కష్టమనిపించే ఈ రోజుల్లో నోరులేని జంతువులను తీసుకువచ్చి శిక్షణ యిచ్చి వినియోగించుకొనడం సులభం కాదు. మనం చెప్పినట్లు అవి వినుకోవు. మనం ఏమి చెబుతామో అసలు వాటికి అర్థం అయితేగా? సినీమాల్లో సందర్భాన్నిబట్టి సన్నివేశాన్నిబట్టి వాటిని ఉపయోగించుకోవాలి. సింహాలు ఉన్నాయంటే ఒకటికి పదిమంది శిక్షకులున్నా సమస్యలే

ఇప్పుడు మనం కొన్ని తెలుగు సినీమాల్లో చూసే దృశ్యాలు అన్నీ స్వంతాలుకావు. కొన్ని వి విదేశిచిత్రంలోనుంచో సంగ్రహిస్తుంటాము.

ఎలాగు సందర్భం వచ్చింది గనుక చెప్పుకుందాం. ఆల్‌ఫ్రెడ్ హిచ్‌కాక్ తీసిన



సినిమాలో కనిపించె ఒక కోతికీ
యీ బాలునికీ దోస్తీ...

'ది బర్డ్స్' చిత్రంలో వేలాది పక్షులను పరిచయం చేశారు. ఆ మహా వ్యక్తికే సాధ్యమైందికాని మరొకరెవరికీ కుదిరుందేదికాదేమో. 'హటారి' చిత్రంలో కూడ జంతువుల ప్రాముఖ్యతను విస్మరించలేము. ఇవి కేవలం ఉదాహరణలకు మాత్రమే. తెలుగు చిత్రసీమకువస్తే 'నమ్మినబంటు' తీసుకుందాం. రెండు ఎద్దులు కలిసి సినీమా రంగంలోనే క్రొత్త తరహా వాతావరణాన్ని సృష్టించాయి. ఆయా ఎద్దులను సమయానుకూలంగా చూపిన దర్శకులు యింకా ఎంత ప్రతిభావంతులై యుండాలో. అన్నపూర్ణావారి 'తోడికోడళ్ళు' చిత్రంలో కుక్క నిర్వర్తించిన ముఖ్యమైన పాత్రను విస్మరించలేము.

విజయావారి 'చంద్రహారం' చిత్రంలో ఏనుగుచేత దర్శకుడు కావలిసినట్లుగా చేయించుకోవడం, అలాగే అంజలీ పిక్చర్సువారి చిత్రాల్లో ఎలుగుబంటి, ఏనుగు, జిప్పీ (కోతి)ని పరిచయం చేశారు వారి 'స్వర్ణమంజరి' చిత్రంలో సింహము కూడా కథానాయకునితో కలియబడటం చిత్రీకరించారు. క్రూరమృగమైన సింహం ముందు మానవుణ్ణివుంచి, పైగా ఆ మృగం కలియబడటం ఎంత ప్రమాదమో వేరే వ్రాయ నవసరంలేదు. చిత్రం సందర్భాన్నిబట్టి జంతువులకు తగిన పద్ధతిలో శిక్షణ యివ్వడం, చిత్రీకరణ జరిగేటప్పుడు దర్శకుడు, ఆ చిత్రంలో పనిచేసే యూనిట్ అంతా ఎంత శ్రమపడవలసిఉందీ మనకు తెలియనిదికాదు.

ఈవిధంగానే జెమినీవారి 'ఇన్సానియత్' చిత్రంలో జిప్పీని విదేశంనుండి తీసుకువచ్చి, కథకు కావలసిన విధంగా చిత్రీకరించారు.

శ్రీ విఠలాచార్య చిత్రాలలోను, గౌరీ ప్రొడక్షన్స్‌వారి చిత్రాలలోను కూడా క్రూర మృగాల్ని చూపిస్తున్నారు. వాటితో షూటింగ్ జరిపినప్పుడు లాంగ్‌షాట్సులో నోటికి పలతగిలించడం, క్లోజుషాట్సులో నోటెనికుట్టడం, శిక్షకుడు హంటర్‌తో ప్రక్కన నిలబడి, యింకా యితర జాగ్రత్తలను తీసుకొని చిత్రీకరణ జరుపుతారు. పాములకు కోరలు తీసివేస్తారు. షూటింగ్ సమయంలో కథకు కావలసిన విధంగా అవి తిరుగవు. వీటివల్ల కొంత ఫిల్ము కూడా పాడవుతుంది. అటువంటప్పుడే దర్శకుడు ఓర్పు, నేర్పుతో

జాగ్రత్తగా ఉండి చిత్రీకరిస్తారు.

చిత్రాలలో వినియోగించటానికి రేస్ క్లబ్‌లలో ఉన్న రకరకాలైన గుర్రాలను అద్దెకు తీసుకు వస్తుంటారు. ఎన్నిరోజులు ఆ గుర్రాలు షూటింగ్‌లో ఉంటే అన్ని రోజులకు రేస్ క్లబ్‌వారికి అద్దెనిస్తూ, శ్రానితో వచ్చిన వ్యక్తి ఖర్చులు కూడా నిర్మాతలే భరిస్తుంటారు. ఏ అశ్వమేధయాగానికో లేక హీరో ప్రాముఖ్యత తెలియజేయడానికో తెల్ల గుర్రాలను, లేదా రాజుల బలాలు తెలియజేయటానికి బలిష్ఠమైన గుర్రాలను తీసుకువస్తారు యీవిధంగా నదుపాయా



పెద్దపులితో ఎల్. విజయలక్ష్మి

లున్నందువలన రేస్‌క్లబ్ చిత్ర నిర్మాతలకు బాగా ఉపయోగపడుతుంది.

మొత్తంమీద జంతువులతో చిత్రాలు నిర్మించటం యీనాటి చిత్రసీమలో తాజా ఆకర్షణ అయినప్పటికి యీ కార్యక్రమం వెనకాల ఎంతో ప్రమాదం (రిస్కు) ఉంది. అయినప్పటికి మిగతావారితోబాటు తెలుగు నిర్మాతలు కూడ వెనుదీయటంలేదు వీరు యిలాగే ముందు ముందు కొనసాగిస్తారని, తెలుగు చిత్రాల్లో ఆకర్షణలతోపాటు ఉన్నత విలువలను కూడా చేకూరుస్తారని ఆశిద్దాం.

—ధర్మాజీ

# మహారాజావారితో షూటింగ్!

కొల్హాపూర్ ఒకప్పుడు రాష్ట్ర రాజధాని నగరంగానేకాక భారతదేశంలో పేరుపొందిన చలన చిత్ర పరిశ్రమ కేంద్రంగా కూడా ఉండేది.

నలభై సంవత్సరాల్రకితం చిత్ర నిర్మాతలు కొల్హాపూర్ నగరంలో అన్ని హంగులూ ఉన్న స్టూడియో లేకపోవటంవల్ల చాలా యిబ్బందులకు గురి అవుతూ ఉండేవారు. కొంతమంది పలుకుబడి గల పెద్దల సలహా ననుసరించి అప్పటి కొల్హాపూర్ మహారాజా రాజారామ్ మహారాజ్ తానే ఒక మంచి స్టూడియోని నిర్మించటానికి పూనుకున్నాడు. చిత్ర పరిశ్రమకి ప్రోత్సాహాన్నివ్వటానికి మహారాజావారు కొల్హాపూర్ సినీటోన్ అనే అన్ని హంగులూ గల స్టూడియోని నిర్మించారు.

ఆ స్టూడియో నిర్మాతల పాలిట వరప్రసాదం అయినప్పటికీ రోజు రోజుకీ చిత్ర నిర్మాణ కార్యక్రమాలపై ఆసక్తి పెంచుకుంటున్న మహారాజావారు స్టూడియోకి తరచుగా రావటం నిర్మాతలకు పెద్ద సమస్యగా తయారైంది. ఆయన తరచుగా షూటింగులకు హాజరు కావటం అసౌకర్యాన్ని కలిగించింది.

షూటింగ్ చూడటానికి వచ్చిన మహారాజావారు నటన, పాటలు, సెట్టింగ్స్ విషయాల్లో తన సూచనల ప్రకారం చిత్రీకరించమనేవారు. ఆయనకి అసలేమీ తెలియని సాంకేతిక విషయాల్లో కూడా కల్పించుకునేవారు మళ్లీ ఆయన అటు వెళ్లగానే మొదటినుంచీ చిత్రీకరణ జరపాల్సి వచ్చేది. ఈ రకంగా ఫిలిం వృథా అయిపోవటం తత్ఫలితంగా నిర్మాతలకు ఆర్థికంగా నష్టం సంభవించటం జరిగేది. కానీ ఎవరికీ యీ విషయాన్ని మహారాజావారి దృష్టికి తేవటానికి ధైర్యం చాలలేదు ఆయన చాలా గర్విష్టి కూడా.

ఒకరోజు షూటింగ్ జరుగుతున్న సమయంలో మహారాజావారి కారు స్టూడియో గేటు దగ్గర ఆగింది. మామూలుగా సెట్ మీద పని చేస్తున్న వాళ్లంతా ఆయన్ని ఆహ్వానించటానికి గేటు దగ్గరికి పరిగెత్తారు కానీ కెమెరామెన్ మాత్రం ఉన్నచోటే ఉండిపోవటంచూసి అంతా చకితులైనారు

మహారాజావారు వచ్చి కూర్చోగానే షూటింగ్ ప్రారంభించారు. అరగంట గడిచిం తర్వాత మహారాజావారు లేచి యువ ఛాయాగ్రాహకునివైపు తిరిగి అతని వీపు తడుతూ 'ఈనాటి అద్భుతమైన నీ ఛాయాగ్రహణానికి నేను చాలా సంతోషిస్తున్నాను. నీ సర్వశక్తులూ చిత్రీకరణపై కేంద్రీకరించావని పిస్తున్నది' అంటూ మెచ్చుకున్నారు. ఆ కెమెరామన్ కూడా రాజావారి ఆస్థానంలో పనిచేసే ముఖ్యులైనవారిలో ఒకాయన కుమారుడు.

ఆ యువ ఛాయాగ్రాహకుడు వినయంతో గౌరవంతో రాజావారికి చేతులు జోడించి కృతజ్ఞతలను తెల్పుకున్నాడు.

మహారాజావారు వెళ్లిపోయిన తర్వాత నిర్మాత కెమెరామన్‌వైపు తిరిగి కొద్దిగా చికాకును ప్రదర్శిస్తూ "ఈరోజు మహారాజావారి గౌరవార్థం ఎంత ఫిలిం వృథా అయింది?" అని ప్రశ్నించాడు.

"ఒక్క అంగుళం కూడా వృథాకాలేదు" అంటూ ఛాయాగ్రాహకుడు సమాధానం చెప్పాడు. అది విని అందరూ చకితులైనారు.

అప్పుడు ఆ యువ ఛాయాగ్రాహకుడు కెమెరాలోనించి గుడ్డ చుట్టబడిన ఒక వస్తువును బయటికి తీసి అందరికీ చూపించి, తర్వాత చెక్కు చెదరకుండా ఉన్న ఫిల్మ్ రీలును తీసి చూపి నవ్వుతూ, "మహారాజావారి కారును గేట్లో చూడగానే మెరుపులాంటి ఆలోచన నా మస్తిష్కంలో మెరిసింది. అందరూ ఆయనకు స్వాగతం యివ్వటానికి గేటు దగ్గరికి వెళ్లారు. కానీ నేను మాత్రం యిక్కడే ఉండి ఫిల్మ్ రీలును కెమేరానుంచి తీసి, యిందాక మీకు చూపిన దాన్ని అమర్చాను. రాజావారు ఉన్నంతసేపూ రీలు లేకుండానే కెమెరాను ఫిల్మ్ ఏమాత్రం వృథా కాకుండా పని చేయించాను. ఇక నుంచి మహారాజావారు వచ్చినప్పుడల్లా ఫిల్మ్ వృథా కాకుండా యిదే పద్ధతిని అవలంబిస్తాను ఈ రకంగా నేను ఛాయాగ్రహణం నిర్వహించినందుకే మహారాజావారు నన్ను చాలా మెచ్చుకున్నారు" అన్నాడు.

ఇదంతా విని అక్కడివారంతా పొట్ట చెక్కలయ్యేలా నవ్వారు.

ఆ యువ ఛాయాగ్రాహకుడు కనిపెట్టిన పద్ధతినే తర్వాత కొల్హాపూర్ సినీటోన్‌లో చిత్రాలు నిర్మించే నిర్మాతలంతా చిత్రీకరణ సమయంలో మహారాజావారు వచ్చినప్పుడల్లా అనుసరించటం మొదలు పెట్టారు

—వి. ఎస్. సుక్తాంకర్

# సినిమా వార్తలు

## జి. వరలక్ష్మి దర్శకత్వంలో యుద్ధచిత్రం

చంద్రశేఖర్ ఫిలింస్ అను నూతనసంస్థవారు దేశరక్షణకు సంబంధించిన యుద్ధచిత్రాన్ని ఒకటి తొలిసారిగా నిర్మించడానికి సర్వ సన్నాహాలు చురుకుగా చేస్తున్నారు శ్రీ జావర్ సీతారాం కథను వ్రాశారు. ఈ చిత్రంలో జి వరలక్ష్మి, కనకశ్రీ, అజిత్‌సింగ్ ప్రధాన భూమికలువేస్తారు. ప్రస్తుతం ఇతర నటీనటుల ఎన్నిక జరుగుతుంది. హైదరాబాద్‌లో నిర్మించే యీ చిత్రానికి జి వరలక్ష్మి దర్శకత్వం చేస్తారు.

దక్షిణాదిలో విశేష ప్రజాభిమానాన్ని పొందిన సుప్రసిద్ధ తెలుగుతార జి వరలక్ష్మి యీ చిత్రానికి దర్శకత్వం వహించడం గర్వించదగిన విషయం ఇది శ్రీమతి జి వరలక్ష్మి దర్శకత్వం వహిస్తున్న రెండవ చిత్రం.

## శ్రీకృష్ణ తులాభారం

సురేష్ ప్రొడక్షన్స్‌వారు 'శ్రీకృష్ణ తులాభారం' చిత్రం నిర్మించడానికి ఏర్పాటు చేశారు పూర్తిగా రంగులలో తీయా ప్రయత్నిస్తున్నారు.

ఈచిత్రంలో శ్రీ కృష్ణుడుగా యన్ టి. రామారావు నటిస్తారు ఇంకా యింతవరకు యస్. వి. రంగారావు, కాంతారావు, పద్మనాభం, జమున, అంజలీదేవి, యల్ విజయలక్ష్మి, గీతాంజలి, జయంతి, వాణిశ్రీలను ఎన్నుకున్నారు మిగతా తారాగణం ఎన్నిక జరుగుతుంది.

శ్రీ సముద్రాల రాఘవాచార్య సంభాషణలు సమకూర్చారు సంగీతం శ్రీ పెండ్యాల నాగేశ్వరరావు, ఛాయ—అన్నయ్య, కూర్పు—మార్తాండ, కళ—రాజేంద్రకుమార్, దర్శకత్వం—కమలాకర కామేశ్వరరావు వహిస్తారు నిర్మాత—డి రామానాయుడు

## నవరాత్రి

ప్రసాద్ ఆర్ట్ పిక్చర్సు సమర్పిస్తున్న విజయ చాముండీశ్వరీ ప్రొడక్షన్సువారి నవరాత్రి చిత్రం షూటింగ్ డిసెంబరు 20వ తేదీన హైదరాబాద్ శ్రీసారధి స్టూడియోలో ప్రారంభమయింది.

ప్రసాద్ ఆర్ట్ పిక్చర్సువారు నిర్మించిన చాలా చిత్రాలకు అసోసియేట్ దర్శకుడుగా పని చేసిన శ్రీ తాతినేని రామారావు యీ చిత్రానికి దర్శకత్వం చేస్తున్నారు సినిమా దర్శకునిగా శ్రీ రామారావుకు యిదే మొదటి చిత్రం.

ఈ చిత్ర ప్రారంభంలో తొలి చిత్రీకరణకు శ్రీ జెమిని గణేష్ క్లాప్ కొట్టారు పవిత్రమైన వివాహ దుస్తులలోఉన్న నాగేశ్వరరావు సావిత్రిలపై తొలి చిత్రీకరణ వేశారు.



'లోగుట్టు పెరుమాళ్లు కెరుక'లో ప్రభాకరరెడ్డి, వాణిశ్రీ

శ్రీయుతులు గుమ్మడి, జగ్గయ్య,రేలంగి రమణారెడ్డి, సూర్యకాంతం, మొదలగు ప్రముఖ తారాగణం యీ చిత్రంలో పాల్గొంటారు

శ్రీ ముళ్ళపూడి వెంకటరమణ సంభాషణలు వ్రాశారు పాటలు—దాశరథి, కొసరాజు వ్రాశారు. సంగీతం—టి. చలపతిరావు సమకూరుస్తున్నారు. ఛాయ—సెల్వరాజు, కళ—జి వి సుబ్బారావు నిర్వహిస్తున్నారు.

## శ్రీకాకుళ ఆంధ్రమహావిష్ణువు కథ

శ్రీ శంభూ ఫిలింస్‌వారు నిర్మిస్తున్న శ్రీకాకుళ **ఆంధ్ర మహా విష్ణువు** కథ చిత్రం షూటింగ్ యీమధ్య వరుసగా పదో ఆరు రోజులు చేశారు.

ఇందులో యన్. టి రామారావు, యస్. వి రంగారావు, రేలంగి, బాలయ్య, చదలవాడ, మల్లాది, ప్రసాద్, లింగమూర్తి, మిక్కిలినేని, జమున, యల్ విజయలక్ష్మి, సూర్యకళ, గిరిజ, ఛాయాదేవి, సబితాదేవి మొదలగువారు పాల్గొన్నారు.

రచన శ్రీ పింగళి నాగేంద్రరావు చ సంగీతం పెండ్యాల నాగేశ్వరరావు సమకూరుస్తున్నారు. ఛాయ—యు రాజగోపాల్, కళ—శేఖర్ అండ్ తోట, నృత్య దర్శకత్వం—ఏ. కె చోప్రా మరియు వెంపటి



మొనగాళ్లకు మొనగాడు'లో సావిత్రి

చినసత్యం వహిస్తున్నారు నిర్మాత—దగ్గుపాటి లక్ష్మీనారాయణచౌదరి, దర్శకత్వం—ఏ. కె. శేఖర్.

## అన్నపూర్ణా ప్రొడక్షన్స్

అన్నపూర్ణా ప్రొడక్షన్సు అను నూతన సంస్థవారు తొలిసారిగా పౌరాణిక చిత్రాన్ని నిర్మించడానికి సర్వ సన్నాహాలు చేస్తున్నారు. ఈ చిత్రానికి శ్రీశ్రీ సంభాషణలు సమకూరుస్తున్నారు ప్రస్తుతం నటీ నటుల ఎన్నిక జరుగుతున్నంది ప్రముఖ తారాగణం ఉంటుందని తెలుస్తుంది. ఈ చిత్రానికి దర్శకుడు కమలాకర కామేశ్వరరావు.

## దైవమిచ్చిన బిడ్డ

మోహన్ పిక్చర్సు వారు తమ 'దైవమిచ్చిన బిడ్డ' చిత్రం పూర్తి చేస్తున్నారు. ఈ చిత్రంలో జమున, యం. ఆర్. రాధా, నగేష్, కళ్యాణకుమార్ మొదలగువారు నటించారు.

రచన-రాజశ్రీ, సంగీతం—పురుషోత్తం.

## చచ్చిస్వర్గానికి వచ్చాం'

రాజదర్బారులో నందివర్ధన మహారాజు పుట్టిన రోజు పండగ మహా వైభవంగా జరుగుతుంటుంది. దర్బారునిండా మహామంత్రి, సామంతరాజులు, పురజనులు వగైరా జన సమూహంతో కిట కిటలాడుతుంది. సభారంజని (యల్. విజయలక్ష్మి) "కామినీ మదన రారా, నీ కరుణకోరి పిలిచేరా" అను పాట పాడుతూ చక్కని నృత్యం చేస్తూంటుంది. పాట మధ్యలో పరమానందయ్యగారి శిష్యులు దర్బారులో ప్రవేశిస్తారు శిష్యుల విషం తిని చచ్చి స్వర్గానికి వచ్చాం, అనుకుంటారు నందివర్ధన మహారాజునుచూసి 'దేవేంద్రుడు' అనుకుంటారు. పాటపాడుతూ నృత్యం చేస్తున్న సభారంజనిని చూసి 'రంభ' అనుకుంటారు

అందమైన నర్తకి చక్కటి నృత్యం చేస్తున్నా, అందులో కవ్వింపు, మురిపింపు ఉన్నా నందివర్ధన మహారాజు 'చిత్రలేఖ' (కె ఆర్ విజయ) నే చూస్తుంటాడు.

నర్తకి నృత్యం ముగిస్తుంది మహారాజు నుండి బహుమతి తీసుకుంటుంది రాజు చేతిని ముద్దు పెట్టుకుంటుంది ఈ దృశ్యాన్ని చూసిన చిత్రలేఖ మహారాజు చేతినుండి రాజముద్రికను నర్తకి దొంగలించినదని అపోహపడుతుంది ఆ విషయం మహారాజుకు మనవి చేస్తుంది.

సభారంజని తన యింటికి వెళ్తుంది. రంభను పలుకరించటానికి, ఆమె యింటిని చూడటానికి రంభను వెంబడిస్తారు దారి మధ్యలో గురువుగారి యిల్లు కనపడుతుంది అవునుమరి. చచ్చి స్వర్గానికివస్తే వాళ్ల ఇళ్లు, వీధులు స్వర్గంలో కూడా కనిపిస్తాయి. ఎప్పుడో ఒక శిష్యుడికి వాళ్ల తాత చెప్పిన మాట జ్ఞాపకం వచ్చింది.

నర్తకి ఇల్లు చేరుతుంది తనను వలలో వేసుకొనడానికి చూస్తున్న మహామంత్రి వచ్చే వేళ అయిందని పరిచారకుల్ని అందర్ని వెళ్లమంటుంది వాళ్లు వెళ్లగానే శిష్యులు వస్తారు.



"శ్రీకృష్ణపాండవీయం'లో ఎన్. టి. రామారావు

'మేము పరమానందయ్యగారి శిష్యులం, విషం తిని, చచ్చి స్వర్గానికి వచ్చాం నీవు రంభవుకదూ. మాకు తెలుసులే!' అంటూ మాట్లాడుతుంటారు మహామంత్రి వస్తాడు. శిష్యులుని ఒక చీకటి గదిలో దాస్తుంది.

'నృత్యం చేస్తూ రాజ ముద్రికను దొంగలించావుకదూ! నేను చూశాను. ఇలాతే' అంటాడు మహామంత్రి సభారంజనితో. 'ఇంకా తీసుకు రాలేదు' అంటుంది ఆ ముద్రికను దాచి సభారంజని మహారాజు కూడ వస్తాడు. శిష్యులు దాచిన గదిలోనే మహామంత్రిని దాస్తుంది. మహామంత్రిని ముద్దు పెట్టుకుంటారు. శిష్యులు రంభ వచ్చిందనుకొని. శిష్యులందరూ ఒకరి చెయ్యి పట్టుకొని మరొకరు యిలా అందరూ బయటకు వస్తారు. ఆఖరు శిష్యుడు మహామంత్రిని కూడా బయటకు లాగుతాడు. మహారాజు, మహామంత్రులు ఎదురుపడతారు.

మహామంత్రి కుట్రను మహారాజుకు సభారంజని ఎరుకపరుస్తుంది.

ఈదృశ్యాన్ని శ్రీదేవి ప్రొడక్షన్సువారు తమ 'పరమానందయ్య శిష్యుల కథ'కు చిత్రీకరించారు. నందివర్ధన మహారాజుగా ఎన్ టి. రామారావు, మహామంత్రిగా ముక్కామల నటించారు. ఇంకా యీ చిత్రంలో పద్మశ్రీ నాగయ్య, శోభన్‌బాబు, ఛాయాదేవి, పద్మనాభం, రాజబాబు, అల్లు రామలింగయ్య, మోదుకూరి సత్యం వగైరాలు నటిస్తున్నారు.

ఈ చిత్రానికి సంభాషణలు—సదాశివబ్రహ్మం, సంగీతం—యస్ రాజేశ్వరరావు సమకూరుస్తున్నారు ఛాయ—పి నాగేశ్వరరావు, దర్శకుడు—సి పుల్లయ్య, నిర్మాత—తోట సుబ్బారావు.

—ధర్మాజీ ●



మన విద్యార్థులను చూచి మనం గర్విస్తున్నాం. దేశం క్లిష్ట పరిస్థితిని ఎదుర్కొంటోందని వారికి తెలుసు. వారు తమ పాత్రను నిర్వహించడానికి త్వరపడ్డారు. ఎన్.సి.సి.లో చేరి రక్త దానమును చేస్తామని ముందుకు వచ్చారు. దేశరక్షణా కార్యములలో పాల్గొని దేశరక్షణ నిధికి విరాళాలు పోగు చెయ్యడానికి సహాయపడ్డారు. ఇన్ని పనులు చేస్తున్నప్పటికీ తమ చదువును అశ్రద్ధ చేయలేదు. ఎందుకంటే, దేశానికి తమ శక్తి సామర్థ్యములు అవసరమని వారికి తెలుసు. అవును నిజమే. మన విద్యార్థులు దేశానికి సేవ చేస్తున్నారు. మీరు చేస్తున్నారా?

**భారత దేశం ఒక్కటే**
**భారత ప్రజలు ఒక్కటే**

DA 65/F 11

Edited Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6&7Thambu chetty Street Madras-1. Phones ; Editorial, 21747; Other depts : 29766. Chief Editor: S. Sambhu Prasad.

